16.8.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:33 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNI. 19

# జమీన్ రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

# భగభగ మండే రైతుకడుపుమంట చంద్ర సర్కార్‌కు చితి పేర్చేట్లుంది!

ఆర్థిక సంక్షోభం అధిగమించడానికి అదనపు పన్నులు విధించడం ద్వారా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కొరివితో తలగోక్కున్నారు. మద్య నిషేధం, సబ్సిడీ బియ్యం పథకాలు ఎత్తివేస్తే పేద ప్రజలు తనపై విరుచుక పడతారని భయపడి, ఆలోటు పూడ్చుకోవడానికి రైతుల మెడకు నీటితీరువా, విద్యుత్ ఛార్జీల గుదిబండ తగిలించారాయన. రైతులైతే నోరు చచ్చిన వారని భ్రమ పడ్డారు. కాని రోజులు గడిచే కొద్దీ, రైతుల కడుపు భగభగ మండి, ఆ మంటలు రాష్ట్ర మంతా కార్చిచ్చు వలె వ్యాపిస్తున్నాయి; దావానలం వలె అంటుకుంటున్నాయి. తెలుగు దేశం పార్టీకి గ్రామాలలో పచ్చిమంచి నీళ్లు పుట్టకుండా పోయే ప్రమాదం కన్పిస్తుంది.

సాధారణంగా ప్రశాంతతకు నిలయమైన ఉభయ గోదావరి జిల్లాలలో రైతు ఆగ్రహం ఉద్యమ రూపం ధరించడం విశేషం. పెద్దగా ప్రయత్నం, ఎవరి పిలుపు లేకుండానే ఏలూరులోవేలాదిమంది రైతులు వీధుల్లోకి వచ్చేశారు తెలుగు మంత్రులను ఉక్కిరి బిక్కిరి చేశారు. ఏలూరు తెలుగుదేశం పార్టీకి బలమైన కోటవంటిది. అక్కడే ఇంత ప్రతిఘటన రావడంతో పసుపు నాయకులకు నోటిరాడ లేదు. రాజమండ్రి, కొవ్వూరు వంటి పట్టణాలలోనూ అదే జరిగింది.

ఈ వార్తకు ప్రచారం రాగానే ఆ ఆగ్రహ జ్వాలలు ఇరుగు పొరుగు ప్రాంతాలకు విస్తరించాయి. మచిలీపట్నంలో మంత్రులే కాదు - కలెక్టరాది అధికార గణమూ రైతుల నిరసనను తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరై పోయారు. రాయలసీమ, తెలంగాణా జిల్లాలలోను ఇదే పరిస్థితి.

అల్‌మట్టి గొడవతో తలమునకలై వుండిన కాంగ్రెసాది ప్రతిపక్ష పార్టీలు ఈ ఉధృతిని ఆలస్యంగా కాని పసికట్ట లేకపోయాయి. ఎవరి సహకారం, ప్రోత్సాహం లేకుండానే రైతాంగం ఉద్యమోన్ముఖులు కావడంతో, ఇప్పుడు కాంగ్రెస్, బిజెపి పార్టీలు వారి ముందు నిలబడి, నాయకత్వ కిరీటం తమ తలపైకి

కొరవ 7 పేజీలో

## పన్నులు కట్టవద్దని నెల్లూరు కాంగ్రెస్ పిలుపు

పెంచిన విద్యుత్ ఛార్జీలు, నీటితీరువాలను కట్టవద్దని జిల్లా కాంగ్రెస్ పిలుపునిచ్చింది. రాష్ట్రమంతటా రైతులలో కన్పిస్తున్న ఉద్యమ ఆవేశాన్ని ఇక్కడా రగిలించడానికి కాంగ్రెస్ నాయకులందరూ కలసి పోరాటానికి నాంది ప్రస్తావన చేస్తున్నారు.

### రైతుశ్రేయం కావాలి!

మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానందరెడ్డి ఈ విషయంలో చొరవ చూపించాడు. నేదురుమల్లి జనార్దనరెడ్డి అనుమతి లభించడంతో వెనుక ముందు తటపటాయింపు అవసరం లేకుండా పోయింది. ఆనం రామనారాయణరెడ్డి, సివి శేషారెడ్డి, కెవి సుబ్బారెడ్డి, పనల పెంచలయ్య, దేవూరు దేవకుమార్‌రెడ్డి తదితరులంతా కలిసి ఆందోళన కార్యక్రమం ప్రకటించారు. నీటితీరువా, పెంచిన విద్యుత్ ఛార్జీలు కట్టకుండా, సహాయ నిరాకరణ జరపమన్నది వారు రైతుల కిచ్చేపిలుపు. జప్తులు చేసినా, కరెంట్ డిస్‌కనెక్ట్ చేసినా పార్టీ పక్షాన అందరమూ కలసి వచ్చి ఆ చర్యలను ప్రతిఘటిస్తామని; అవసరమైతే జైళ్లకైనా వెళ్లడానికి సిద్ధమని వారు ప్రకటించారు.

తొలి కార్యక్రమంగా రేపు 18తేది ముత్తుకూరులో రైతు నిరసన జరుగుతుంది.



ఈ కండ్లేటి హెడ్ రెగ్యులేటర్ పనిలోనే 3 కోట్ల దోపిడీ జరుగుతుండేది!

# ఆలస్యంసాకుతో మూడుకోట్లుగుటకాయస్వాహా!

## కండ్లేరు కాంట్రాక్టులో కాంగ్రెస్ నాయకుల కుంభకోణం!

మద్రాసుకు నీర్లివ్వాలనే తొందరను సాకుగా చూపి, కోట్లాది రూపాయలను పుట్ట పుడియంగా అరగించ డానికి తెలుగు గంగ కాంట్రాక్టర్లు పెద్ద కుట్ర పన్నుతున్నారు. ఇందుకు ప్రభుత్వమూ విధిలేక తలవంచ వలసి వస్తున్నట్లుంది.

కడప, చిత్తూరు జిల్లాలలో ఈ మాదిరి కుంభ కోణాలు ఇంకెన్ని జరుగుతున్నాయో మనకు తెలియదు, కాని, నెల్లూరుకు సంబంధించి మాత్రం కండ్లేరు హెడ్ రెగ్యులేటర్, స్వర్ణముఖి అక్విడెక్ట్‌ల విషయంలో దాదాపు ఐదు కోట్ల రూపాయల దొంగ బిల్లులు బొక్కడానికి రంగం సిద్ధమై వుంది.

కండ్లేరు హెడ్ రెగ్యులేటర్ నిర్మాణం పని కాంట్రాక్టు విలువ 17 కోట్లు. టెండరు సమయంలోనే తోటి కాంట్రాక్టర్లతో రాజీపడి, అధిక ధరకు తీసుకొన్న టెండర్ అది. టెండర్ ఖరారైన తర్వాత ఒక పథకం ప్రకారం రెగ్యులేటర్ నిర్మాణం ఆలస్య మయ్యేటట్లు చేశాడు కాంట్రాక్టరు.

తాను పని మొదలు పెట్టినప్పటికీ, ఇప్పటికి రేట్లలో చాలా తేడాలు వచ్చాయని; పెరిగిన రేట్ల ప్రకారం తనకు అదనపు బిల్లు చెల్లిస్తే

అగ్రిమెంట్ ప్రకారం ఆ రెగ్యులేటర్ నిర్మాణం ఎప్పుడో పూర్తి చేసి వుండాలి. కాని ఇంకా 20 శాతం పని పెండింగ్‌లో వుంది. అది పెండింగ్‌లో వుంది అనడం కంటే, పెండింగ్‌లో పెట్టారనడం నిజం. మద్రాసుకు నీళ్లు వదలాలంటే ఈ రెగ్యులేటర్ తప్పనిసరి. దీని ద్వారానే నీరు కండ్లేరు రిజర్వాయర్ నుంచి కాలువలోకి ప్రవహించాలి. అంత కీలకమైనది కాబట్టే కాంట్రాక్టర్ తెలివిగా నిర్మాణం ఆలస్యం చేశారు.

తప్ప, తాను పని పూర్తి చేయనని పేచీ పెట్టారట. మద్రాసుకు నీళ్లు ఇవ్వవలసిన తేదీ దగ్గర పడుతుంతడంతో – అధికారులకు విధి లేకుండా పోయింది. అధిక చెల్లింపుకు అంగీకరించి పని పునః ప్రారంభింప జేశారు.

విచిత్రమేమి టంటే, కాంట్రాక్టర్ బ్లాక్ మెయిల్‌ను కప్పిపెట్టి, ఆలస్యానికి బాధ్యతను అధికారులు తమపై వేసుకోవడం. సకాలానికి డిజైన్లు వస్తువులు సరఫరా చేయడం వీలు కాలేదు కాబట్టి, పని ఆలస్య మైందని అధికారులు సర్టిఫికెట్ ఇచ్చారట. దీన్ని దగ్గర పెట్టుకొని కాంట్రాక్టర్ బ్లాక్‌మెయిల్‌కు పాల్పడ్డారు. ఈ కథకు ముగింపు – 3 కోట్ల రూపాయల అదనపు బిల్లు చెల్లింపు. దాదాపు 18 శాతం అదనపు విలువను పుట్టి పుణ్యానికి కాంట్రాక్టర్‌కు దోచి పెడుతున్నారు.

ఈ కాంట్రాక్టరు, దీని అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి గారి అల్లుడు. అందువల్ల గ్రీండ మంది పైవరకు అదనపు బిల్లు పైలు చకచకా పరుగులు పెట్టింది. ఒక తీసుకొని మంత్రి కూడా సంజీవ రెడ్డి గారి తరపున ఆంధ్ర ప్రభుత్వానికి దీని విషయమై సిఫారసు చేశారట. రాజకీయ వాదులు తమ పదవులను వదల కుండా అంటి పెట్టుకొని వుండడానికి ఇటువంటి అవసరాలు చాలా వుంటాయి మరి!

స్వర్ణముఖి అక్విడెక్ట్‌కు కూడా కోటి 75 లక్షల అదనపు బిల్లు చెల్లిస్తున్నారట.

ఏమిటీ అన్యాయం? నిర్మాణం పని ఆలస్య మైనందుకు కాంట్రాక్టర్‌ను తప్పు పట్టి, పెనాల్టి విధించ వలసింది పోయి; అదనపు బిల్లుతో సత్కరించడం దుర్మార్గం కాదా? ప్రజాధనాన్ని ఇంతగా దుర్వినియోగం చేయడం నేరం కాదా? కండ్లేరు రెగ్యులేటర్ పనిలో జాప్యమే కాక, నిర్మాణము [illegible] నాసిరకంగా వుందని,

కొరవ 7 పేజీలో

# షేర్ మార్కెట్ కూలిపోతున్నా చిదంబరం చిద్విలాసం!

షేర్ మార్కెట్ దురవస్థకు కేంద్ర ప్రభుత్వం కాని, ప్రభుత్వ రంగ ఆర్థిక సంస్థలు కాని, యుటిఐ వంటి సంస్థలు కాని ఏ మాత్రం పట్టించు కోవడం లేదు. బడ్జెట్ ప్రవేశ పెట్టినప్పటి నుంచి మార్కెట్ చలనం పతనం వైపుకు తప్ప, పునరుజ్జీవనం పక్షంగా వుండడం లేదు. పెద్ద పెద్ద కంపెనీల షేర్ విలువలే దిగజారి పోతున్నాయి. సుస్థిరమనుకొన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గ్లోబల్ ట్రస్ట్ బ్యాంకు, ఓరియంటల్ బ్యాంక్ ఆఫ్ కామర్స్ వంటి షేర్లు అమాంతంగా పడిపోయాయి.

బడ్జెట్ ప్రవేశ పెట్టినప్పుడల్లా షేర్ల ధరలు కొద్దో గొప్పో తగ్గడం మన్‌మోహన్ సింగ్ ఆర్థిక మంత్రి అయిన నాటి నుంచి అలవాటే. అయితే ఈసారి ధరలు తగ్గడం కాదు – పతనమైనాయి. మార్కెట్ కుప్పకూలి పోయే పరిస్థితులు ఏర్పడు తున్నాయి. అయినప్పటికీ ఆర్థిక మంత్రి చిదంబరం ఏ మాత్రం స్పందించక పోవడం విచారకరం. చిద్విలాసంగా చూస్తూ కూర్చుండి పోతున్నా రాయన.

ఈ పతనానికి కారణం ఆయనే. ఆయన ప్రవేశ పెట్టిన మినిమం ఆల్టర్నేటివ్ ట్యాక్స్ ప్రభావం వల్లనే షేర్ మార్కెట్ ఇంత ఒడిదుడుకులకు లోనౌ తున్నది. ఈ ట్యాక్స్ వల్ల జీరో ట్యాక్స్ కంపెనీలపై మాత్రమే ప్రభావం వుంటుందని భావించారు. కాని అది అన్నిటిపైనా తన దుష్ఫలితాలను చూపుతున్నది. చిన్న తక్కిన కంపెనీలు మరీ దెబ్బతిని పోయాయి. వాటి షేర్లు అడిగేవారే లేకుండా పోయారు.

**400 పాయింట్లు పతనమైనా స్పందన లేదు; బ్రతికించే ఆలోచన చేయడం లేదు!**

పెద్ద కంపెనీల లోనూ స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ 170 కోట్లు, రిలయన్స్ కంపెనీ 180 కోట్లు అదనంగా పన్నులు చెల్లించ వలసి వస్తున్నది. డాక్టర్ రెడ్డి లాబరేటరీస్, నాగార్జున ఫర్టిలైజర్స్, టాటా పవర్ వంటి కంపెనీలు మాత్రం ఈ సమస్య నుంచి తప్పించు కున్నాయి.

సిమెంట్ కంపెనీలలో మద్రాసు సిమెంట్, చెట్టినాడ్ సిమెంట్ కంపెనీలు; ఇతరత్రా నిర్మా, కెమ్ ప్లాస్ట్ వంటి సంస్థలు ఈ పన్ను వల్ల చాలా పెద్ద భారాన్ని మోయవలసి వస్తున్నది.

లాభా లార్జిస్తున్న కనీసం వెయ్యి కంపెనీలు 'మ్యాట్' వలలో చిక్కి పోయినాయి. వారి లాభాలు విపరీతంగా తగ్గిపోతాయి. ఇప్పటి వరకు అధిక టర్నోవరు, అధిక నికర లాభం చూపిస్తుండిన పలు కంపెనీలు పన్ను బెడద తప్పించు కోవడానికి తద్విరుద్ధమైన ఫలితాలు ప్రకటిస్తాయన్న భయంతో ఇన్వెస్టర్లు ఆయా షేర్ల జోలికి పోవడానికి భయపడుతున్నారు. అందువల్లే మార్కెట్‌లో ఇంత మాంద్యం ఏర్పడింది.

ఈ పరిస్థితులలో మార్కెట్ పునరు జ్జీవనానికి ఆర్థిక మంత్రి, ప్రభుత్వ రంగ సంస్థలు, యుటిఐ వంటి సంస్థాగత పెట్టుబడి దారులు ఏదో ఒక ఉపాయం ఆలోచించి వుంటే బాగుండేది. కానీ వారెవ్వరూ దీనిపై ప్రతి స్పందించడం లేదు; ఎటువంటి చర్యలూ చేపట్టడం లేదు.

షేర్లకు సంబంధించే కాకుండా, ఈ పన్ను విధానం వల్ల పారిశ్రామిక విస్తరణ సైతం మందగి స్తుందని చెప్తున్నారు. అనేక కంపెనీలు తమ విస్తరణ పథకాలు, కొత్త ప్రాజెక్టులను ఆలస్యం చేస్తాయి. ఇప్పటి వరకు వారు తమ లాభాలను ఈ విస్తరణకు వినియోగిస్తూ వచ్చారు. పలు కంపెనీల ఇపిఎస్ తగ్గిపోతున్నది. అందువల్ల వారు తమ డివిడెండ్లను తగ్గిస్తారు. ఆ స్థితిలో ప్రజల నుంచి ప్రైమరీ మార్కెట్‌లో నిధుల సేకరణ సైతం కష్టమే.

డాక్టర్ ఎ. దుర్గా ప్రసాద్





[illegible] అగ్ని ప్రమాద [illegible] బాధితులకు వంట పాత్రలు [illegible] ఎమ్మెల్యే పసబాక లక్ష్మి, ఆనం వివేకానంద రెడ్డి, కెవి సుబ్బా రెడ్డి తదితరులు

# మనీ టివితో షేర్ల జూదం ముదిరిపోతూంది!

నేషనల్ స్టాక్ ఎక్స్చేంజి రేట్ల చలనాన్ని మనీ టివి ఛానల్‌లో ప్రత్యక్ష ప్రసారం చేయడం వల్ల దేశమంతా షేర్ల జూదం ప్రారంభ మైంది. క్యాసినోలలో జూదమాడినట్లు జనం షేర్లపై ఆడుతున్నారు. చిన్న చిన్న పట్టణాలలోనూ ఇదొక మహమ్మారి వలె వ్యాపిస్తున్నది. నెల్లూరు జిల్లాలో రోజుకి కనీసం 3 కోట్ల రూపాయల విలువైన జూదం జరుగు తున్నదని అంచనా.

టివిలో వచ్చే షేర్ల ధరల హెచ్చు, తగ్గుల ఆధారంగా ఈ జూదం నడుస్తుంది. నేషనల్ స్టాక్ ఎక్స్చేంజి కౌంటర్లు విడివిగా ప్రారంభం కావడంతో ఎక్కడి కక్కడ, టెలిఫోన్లు, ఫ్యాక్స్‌లపై లావాదేవీలు జరిగిపో తున్నాయి. ఉదయం నుంచి సాయంత్రం వరకు అమ్మకాలు, కొనుగోళ్లకు ఆర్డర్లు పెట్టడం; సాయంత్రం ముగింపు సమయంలో లాభమో, నష్టమో చూసుకొని లేచి పోవడం చాలా మందికి అలవాటై పోయిందిప్పుడు. ఈ జూదంలో చేతులు మారే షేర్లు [illegible]వ; లావాదేవీలు మాత్రం జాస్తి.

## విజ్ఞప్తి

డాక్టరు పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి గారి కాంస్య విగ్రహాన్ని కావలి విశ్వోదయ ప్రాంగణంలో ప్రతిష్ఠించాలని మేము చేసే ప్రయత్నంలో అందరూ భాగస్వాములు కావాలని మా ఆకాంక్ష. డాక్టరు రాంగారి విగ్రహాన్ని తయారు చేయడానికి పనికి వచ్చే ఫోటోలు దొరకడం లేదు. ఎవరి వద్దనైనా ఫుల్ సైజ్, సైడ్ యాంగిల్ ఫోటోలు వుంటే మాకు తెల్పితే మేము వచ్చి తీసుకొని పని పూర్తికాగానే జాగ్రత్తగా మీకు చేరుస్తాం.

డి. రామచంద్రారెడ్డి

ప్రెసిడెంట్, డా. పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి కాంస్య విగ్రహ స్థాపన కమిటీ, విశ్వోదయ, కావలి.

# మరుగుజ్జు నాయకులు

రాజకీయాలలో ఒక స్థాయి, అంతస్తు, వ్యక్తిత్వ ఔన్నత్యం లేని వ్యక్తులు పదవు లధిష్ఠిస్తే ఏమి జరుగుతుందో దేవగౌడను చూసి తెలుసుకోవచ్చు కర్ణాటక హద్దులు దాటి ఎరుగని ఆయన్ను దేశ ప్రధానిగా నియమించి యునైటెడ్ ఫ్రంట్ నాయకులు చాలా పెద్ద పొరపాటు చేశారు. తాత్కాలిక రాజకీయ అవసరాల కోసం, తమ చెప్పుచేతల్లో వుండే వాడని భావించి ఆయన్ను ప్రధానిని చేసిన దుష్ఫలితం ఇప్పుడు అర్థమౌ తున్నది వారికి! ఆనాటి రాజకీయ సర్కస్ క్రీడలో అత్యుత్సాహం చూపి, అందరి కంటే అధికంగా వ్యవహారాలు నడిపిన చంద్ర బాబు నాయుడికి అది మరీ కంటక ప్రాయంగా అనుభవానికి వస్తున్నది. చేసుకొన్న వారికి చేసుకున్నంత మహాదేవ అని వూరికే అనలేదు పెద్దలు.

ఆల్‌మట్టి ప్రాజెక్ట్ విషయంలో ప్రధాన మంత్రి దేవగౌడ వ్యవహరించిన, వ్యవహరిస్తున్న తీరు ఆ పదవి హుందా తనానికి తగినట్లు లేదు. తాను దేశానికి ప్రధాని అన్న మాట మరచిపోయి, కర్ణాటక నేతగా ప్రవర్తిస్తున్నా రాయన. కన్నడ ప్రజల మెప్పు పొందడమే తన ధ్యేయమన్నట్లు వ్యవహరి స్తున్నారు. రహస్యంగా, దొంగ తనంగా ఆ ప్రాజెక్టుకు అనుమతి మంజూరు చేయడం; అది బయట పడకుండా కప్పి పెట్టుకోవ డానికి నానా పాట్లు పడడం; అనుమతివ్వ లేదని అబద్ధాలు; చెప్పడం ఈ గొడవ లిట్లా జరుగు తుండగానే ఆ ప్రాజెక్టుకు 200 కోట్ల స్పెషల్ గ్రాంట్ మంజూరు చేయడం — వంటి చర్యల ద్వారా దేవగౌడ ప్రధాని పదవికి తాను తగనని నిరూపించు కున్నాడు. అంత ఉన్నత స్థానంలో వుండేవారు చేయదగిన పనేనా ఇది?

పుట్టిన వూరు మీద, తోబుట్టువులైన ప్రజల మీద అభిమానం వుండడం తప్పు కాదు. అయితే అదే ప్రపంచం, అదే లోకంగా బ్రతకడం సంకుచిత మనస్తత్వం అన్పించు కొంటుంది. అందులోనూ ప్రధాన మంత్రి పదవిలో వుండేవాడు యావద్దేశ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని పరిపాలించాలే తప్ప అధికారాన్ని అడ్డం పెట్టుకొని, అడ్డదారులు వెతికి, తన వారిని అందల మెక్కించాలని చూడడం ఘోరమైన నేరం. ఇంకొకరికి అన్యాయం చేసి, తన వారికి మేలు చేయాలను కోవడం ఇంకా హీనమైన తప్పిదం.

ఆల్‌మట్టి విషయంలో దేవగౌడ అనుసరిస్తున్న వైఖరి అత్యంత దురదృష్ట కరమైనది. ఢిల్లీలో వున్నా ఆయన ఆలోచనలు, అంతరంగం బెంగుళూరులోనే కొట్టుకు లాడుతున్నాయి. ఆ పరిధి దాటి రాలేక పోతున్నారాయన; అంతకు మించి తన వ్యక్తిత్వం పెంచు కోవడం ఆయనకు చేత కావడం లేదు.

స్వాతంత్ర్యం వచ్చిన ఈ యాభై ఏళ్లలో భారతీయ ప్రజాస్వామ్య వృక్షం ఎటువంటి కుక్కమూతి పిందెలను ప్రసవిస్తున్నదో చూడండి. సరిగ్గా 50 ఏళ్ల క్రితం, ఇదే ఆగష్టు 15 తేది, ఇదే ఎర్రకోట పై నుంచి తొలి సందేశం విన్పించిన జవహర్ లాల్ నెహ్రూ — హిమగిరి శిఖర సమాన, సమున్నత వ్యక్తిత్వంతో అఖండ భారత జాతినే కాక — యావత్ప్రపంచ నాయకత్వ శ్రేణికి ఎదిగారు; స్వర్ణోత్సవం నాటికి ఆ కుర్చీలో కూర్చున్న దేవగౌడ ఆల్‌మట్టి డ్యాం ఎత్తును మించలేని మరుగుజ్జు నాయకుడిగా చులకన పాలౌతున్నాడు. 50 ఏళ్లలో ఎంత తేడా?

ఇటువంటి మరుగుజ్జుల చేతికి

జమీన్‌రైతు

దేశాన్ని అప్పు చెప్పడం యునైటెడ్ ఫ్రంట్ నాయకులు చేసిన తప్పిదం. మరొక కోణం నుంచి చూస్తే ఆ ఫ్రంట్‌లో వుండే వారందరూ అటువంటి వారే. ఫ్రంటే కాదు — ఈరోజు దేశంలో చలామణిలో వున్న ఏ రాజకీయ నాయకుడికి జాతీయ స్థాయి లేదు; గుర్తింపు లేదు; గౌరవం లేదు. నాలుగు జిల్లాలకో, ఒక వంద గ్రామాలకో పలుకుబడి పరిమితమైన రాజకీయ వాదులు ఢిల్లీలో కూర్చొని జాతీయ రాజకీయాలు నడుపు తున్నారు. కులతత్వం, ప్రాంతీయ తత్వం, సంకుచిత మనస్తత్వం దేశ రాజకీయాలను పూర్తిగా ఆక్రమిం చేస్తున్నాయి. అందువల్లే జాతీయ స్థాయి నాయకులే కాదు, జాతీయ పార్టీలూ కనుమరుగై పోతున్నాయి.

దేశానికి, జాతికి అరిష్టం తెచ్చిపెట్టే పరిణామం ఇది. ఇటువంటి మరుగుజ్జులు రాజ్యం చేస్తే అఖండ భారతావని విద్వేషాలతో, విభేదాలతో, వైషమ్యాలతో ముక్క చెక్కలై పోయే ప్రమాదం వుంది. ప్రజలలో భారతీయత లోపించి ఆంధ్రులు, కన్నడిగులు, తమిళులు, మరాఠీలు, పంజాబీలుగా విడిపోయే ఘోర ప్రమాదం ముంచు కొస్తుంది.

దేవగౌడ ప్రధాని పదవిలో వుండడం — ఆల్‌మట్టి ప్రాజెక్టుకే కాదు, దేశ భవితవ్యానికే చేటు. ఐక్య ఫ్రంట్ నాయకులకు ఏ మాత్రం విజ్ఞత వున్నా ఈ మరుగుజ్జును తక్షణం ఆ పదవి నుంచి తప్పించాలి; దేశ ఐక్యతను కాపాడాలి.

---

## జమీన్‌రైతు

16-8-46 పేజీలు:12
వెల:0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

బొంబాయిలోని టైమ్సు ఆఫ్ [illegible] దైనిక పత్రికకు చీఫ్ రిపోర్టరుగా నుండిన భైరవరసు హనుమంతరావు గారు అక్కడి దైనిక జాతీయ ఆంగ్ల పత్రిక "నేషనల్ స్టాండర్డు"కు సహాయ సంపాదకులుగా ఈనెలాఖరు లోపుగ చేరుతున్నారు. హనుమంత రావుగారు టైమ్సు ఆఫ్ ఇండియాలో 1928వ సంవత్సరమున ప్రవేశించిరి. గడచిన 11సంవత్సరములకు పైగా ఆపత్రికకు చీఫ్ రిపోర్టరుగా ఉన్నారు. అంతకు పూర్వము "ఆంధ్రపత్రిక" "స్వరాజ్య" "ఫ్రీ ప్రెస్" కార్యాలయ సంపాదక వర్గమున పనిచేసిరి.

### రాష్ట్రంలో గుడ్డల రేషనింగు

మొత్తం మద్రాసు రాష్ట్రంలో ఆగష్టు 29తేది నుంచి రేషనింగు విధానం జరపడానికి మద్రాసు ప్రభుత్వం నిర్ణయించింది.

### రాజాగారి కళాశాల సైన్సు

నెల్లూరు కళాశాల పాలకులు గుంపుల మీద మోజు చూపుతున్నారే కాని, చదువుల మీద, శ్రమ శిక్షణ మీద అభిలాష చూపకపోవడం శోచనీయం. గదులు - అయ్యవార్లు - పరికరాలు లేనప్పుడు ఈ పిల్లల మంద లెందుకు? అడ్మిషన్ లేదంటే యితర్రాపోరా? బడి తెరచి ఒకటిన్నర నెల అయినా ఏ అయ్యవారు గాని - పట్టున పదిమాటలు చెప్పినట్లు లేదు. ఈ స్థితిని చక్కదిద్దితేగాని హైస్కూలు యింకా అధోగతికి పోతుంది.

కాలేజి కెమిష్టి డిపార్టుమెంటు అధ్వాన్నంలో అధ్వాన్నం. ఇంత వరకు అయ్యవారు - డిమాన్‌స్ట్రేటరు లేరు. ఇంత ఉపేక్షకు కారణం? అధ్యాపకులు -యీ అన్‌ఫ్లెటెడ్ స్థితిలో కూడ యిక్కడకు రాలేదంటే లోపం ఎక్కడ ఉన్నట్లు?

ఇంకా ఆలస్యం చేస్తే పిల్లల పాఠాలు పోతవి.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

### శారదా చట్టమేమైంది?

శారదా చట్టం అమలులో ఉండగానే పూర్వం వలెగాక ఇప్పుడు అధికారులకు చట్టం ఉల్లంఘించిన వారిని శిక్షించుటకు అధికారం ఉండిగూడ ముక్కు పచ్చలారని పిల్లల పెండ్లిళ్లు మాన్పించక పోవడం ప్రజా ప్రభుత్వ దినాలలో సహించ దగినది కాదు.

### హరిజన దేవాలయ ప్రవేశం

హరిజనోద్ధరణకై కంకణం గట్టిన కాంగ్రెసు మంత్రుల పాలనలోనే నెల్లూరు వేణుగోపాల స్వామి వారి

కొరవ 10 పేజీలో

---

# జనార్ధనరెడ్డి నిర్ణయాలే చంద్రబాబుకు తరుణోపాయాలు!

పార్లమెంటు ఎన్నికలకు ముందు ముఖ్య మంత్రి చంద్ర బాబు నాయుడు ఆంధ్ర ప్రజలకు అరచేతిలో వైకుంఠం చూపారు. ఎన్నిక లయ్యాక ఖాళీ ఖజానా తలుపులు తెరచి రాష్ట్రాన్ని అభివృద్ధి ఎలా చెయ్యాలని ప్రజలను ప్రశ్నిస్తున్నారు. ఈ విషయం ఎన్నికలకు ముందు ఆయనకు తెలుసు. ప్రజలను మభ్యపెట్టి, మాయచేసి 16 పార్లమెంటు సీట్లు కొట్టేసారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రిగా నేదురుమల్లి జనార్దన రెడ్డి ఎంతో విజ్ఞతతో ఆలోచించిపబ్లిడి బియ్యం రేటు రూ.3.50 చేస్తే- అనాడుఅరచి గీపెట్టిన చంద్ర బాబు ఈనాడు అదే రేటు చేయక తప్పింది కాదు. విద్యా విధానంలో విశేష అనుభవమున్న జనార్ధన రెడ్డి ప్రైవేట్ మెడికల్ కాలేజిలకు అనుమతి ఇచ్చి రాష్ట్రం సొమ్ము పరాయి రాష్ట్రాల పాలు కాకుండా చూడాలనుకొన్నారు. కాని అనాడు రేగిన అనవసర రగడలో నైతిక విలువలకు ప్రాధాన్యత ఇచ్చి రాజీనామా చేశారు. చంద్ర బాబు అప్పటి వాటికన్నా ఎక్కువ సంఖ్యలో కాలేజిలకు నేడు అనుమతి ఇస్తున్నారు. 5 శాతం లాభంతో రాష్ట్ర విద్యుత్ సంస్థ నడవాలని ఆయన ప్రతిపాదించిన నిర్ణయాన్ని మళ్లీ చంద్రబాబు అమలు పరచను ఎక్సర్‌సైజులు చేస్తున్నారు. నేదురుమల్లిని ఆనాడు అనవసరంగా విమర్శించిన చంద్ర బాబు ఈనాడు ప్రజలకు సమాధానం చెప్పి తీరాలి.

ఇస్కపల్లి ఎం. శ్రీనివాసులు

### ధర్మకర్తలుగా క్రిమినల్స్?

ఇటీవల నెల్లూరు టౌన్‌లోను, ఇతర గ్రామాల్లోను దేవాలయాలకు, ధర్మ సంస్థలకు ధర్మకర్తలను నియమించారు. వారిప్రమాణ స్వీకార మహోత్సవాలు కూడా అట్టహాసంగా జరిగాయి.రాష్ట్ర మంత్రివర్యులు రమేష్‌రెడ్డికూడా వీటిలో

**జనవాణి**

పాల్గొన్నారు. ప్రభుత్వం ధర్మకర్తలను నియమించే సమయంలో ఆస్తికత్వం కలిగి, దేవాలయాల గూర్చి కొంత అవగాహన కలిగిన వారిని నియమిస్తే సబబుగా వుండేది. అలా కాకుండా రౌడీలను, క్రిమినల్స్‌ను నియమించారు. వీరిని ట్రస్టీలుగా భక్తులు ఆమోదించ గలరా? వీరి ఆధ్వర్యంలో సంస్థలు బాగుపడ గలవా? పూజా కార్యక్రమాలు, స్థిర, చరాస్తులకు భద్రత, పూజకు వెళ్లే స్త్రీలకు రక్షణ వుంటుందా? తెలుగు [illegible] పార్టీ నిరుద్యోగ కార్యకర్త పునరావాసం కల్పించి, [illegible] కల్పించాలంటే ఎన్నో సంస్థలున్నా[illegible] అందుకుదేవాలయాలనే ఎందుకు ఎంచు కున్నారో అర్థం కావడం లేదు. ఇప్పటికే అనేక ధార్మిక సంస్థలు చోటా, మోటా రాజకీయ నాయకుల కబంధ హస్తాలలో బంధింపబడి వారి స్వార్థానికి నిర్వీర్యమై పోయాయి. భవిష్యత్తులోనైనా ధర్మకర్తలను నియమించే సమయంలో వారి గత చరిత్రను కొంత వరకైనా పరిశీలించాలి.

నెల్లూరు కె. సత్యనారాయణ

### శేషేంద్ర శర్మను నెల్లూరు ఎందుకు మరచింది?

తిక్కన, వేదం వెంకట రాయ శాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, బెజవాడ గోపాల రెడ్డి వంటి కవులు, పండితులు, సాహితీ వేత్తలకు పుట్టినిల్లయిన నెల్లూరు సీమ మరో కవి, విమర్శకుడు గుంటూరు శేషేంద్ర శర్మను మాత్రం ఎందువల్లో మర్చి పోయింది. అమెరికా, జర్మని, జాంబియా, మెడగాస్కర్‌లోని తెలుగు వారు ఆయన్ను గుర్తించి అనేక అవార్డులతో ఆయనను సత్కరించారు. 94లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు కూడా వచ్చింది. మన దేశంలోని బెంగాల్, మహారాష్ట్ర, కేరళ, కర్నాటక, తమిళనాడు లోని [illegible] కూడా [illegible]న్నారు. [illegible] పెడత చెట్టు

కొరవ 12 పేజీలో

# డిసిసి చూరు పట్టి వ్రేలాడడానికి సిగ్గు వేయడం లేదా?

జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి గారు ఇంకా ఆ పదవిలో కొనసాగడం నా మటుకు నాకు చాలా ఆశ్చర్యం కల్గిస్తోంది. ఆయన ప్రెస్ కాన్ఫరెన్సు పెట్టినప్పుడల్లా రాజీనామా వార్త ప్రకటించ బోతున్నారేమో నని చెవులు రిక్క పొడుచుకొని ఆలకించడం! అది తప్ప తక్కినవన్నీ మాట్లాడి ప్రెస్‌వాళ్లను సాగనంపేడని తెలియగానే ఈ రోజు ముహూర్తం బాగాలేదు కాబోలని సరిపెట్టు కోవడం నాకే కాదు – చాలా మందికి అలవాటై పోయింది. ఆ ముహూర్తం పెట్టగల్గే సిద్ధాంతి ఎవరో, ఎక్కడున్నాడో తెలియదు మరి!

సంజీవ రెడ్డి గారు చాలా రోషం కల్గిన నాయకుడు. ఒక మోస్తరు మనిషి ఆయనకు ఎదురు నిలబడి మాట్లాడలేడు. ఆయనతో ఒకటి మాట్లాడితే తక్కువ; రెండు మాట్లాడితే ఎక్కువ. ఏ మాత్రం తేడా వచ్చినా దులపరించి పారేస్తాడు. జిల్లా రాజకీయం ఆనం వారి అడుగు జాడలలో అతి వినయంగా నడిచే రోజులలోనైతే సంజీవ రెడ్డి గారికి కోపం ముక్కు కొసనే వుండేది. తుమ్మినా, దగ్గినా పిడుగు పాటు వలె ఎదుటి వాడి నెత్తిన పడేది.

అంతటి రోషం, కోపం ఆత్మాభిమానం కల్గిన ఆయన ఇప్పుడు దేనికి ఇట్లా వ్యవహరిస్తున్నారు? ఆ సంజీవ రెడ్డి గారికి, ఈ సంజీవ రెడ్డి గారికి ఎంత తేడా?

ఆ వ్యత్యాసం నెల్లూరు పెన్నంత వెడల్పుగా వుండ బట్టే ఆయనింకా డిసిసి అధ్యక్షుడుగా కొనసాగుతున్నారు కాని, అప్పటి రోషం ఏ మాత్రం మిగిలి వుండినా మనం ఆయన్ని పదవిలో చూసి వుండ గల్గి వారం కాదు. ఏ మాత్రం ఆత్మాభిమానం వున్నవాడైనా ఇంతకాలం ఆ చూరు పట్టుకొని వ్రేలాడలేడు. పార్లమెంట్ ఎన్నికలు కావడమే తడవు – రోశయ్య రొక్కా, పట్టుకొని విలదీసి, అడగాల్సిన వన్నీ అడిగేసి, బాగా కడిగేసి, రాజీనామా కాగితం ముఖాన విసిరేసి వచ్చేస్తానని ఆయనొక సారి పత్రికల వారికి చెప్పినట్లు గుర్తు. పార్లమెంటు ఎన్నికలు ముగిసి పోయి, ప్రధాని దేవగౌడ ఆల్మట్టి డ్యాంలో సజీవ జల సమాధై పోయి, మళ్లీ పార్లమెంటుకు మధ్యంతర ఎన్నికలు జరిగే సమయం కూడా వచ్చేసింది. కాని ఆ విషయం మాత్రం ఆయనకు గుర్తు వున్నట్లు కన్పించడం లేదు. ఒక రిద్దరు దిన పత్రికా విలేఖరులు గుర్తు చేద్దామని ఆక్కడి దాకా వెళ్లి, ఆ కోపం తట్టుకో లేమని భయపడి వెనుదిరిగి వచ్చేశారట. ఆ విలేఖరు లిప్పుడయా రక్త కన్నీరు నాటకం చూసినట్లు లేరు. చచ్చి ఏ స్వర్గాన వున్నాడో కాని నాగభూషణం – పదవి వదలలేని నాయకుల గురించి ఎంత చక్కటి డైలాగులు చెప్పేవాడు; ఎటువంటి ఉపమానా లిచ్చేవాడు?

## సణుగుడు

తన పేరు వెనుక డిసిసి అధ్యక్షత అనే తోకను తగలించు కోవడానికి ఆయనకు సిగ్గు వేయక పోవచ్చు కాని; ఆయన అధ్యక్షత క్రింద పనిచేయడానికి జిల్లా కాంగ్రెస్ వాదులు మాత్రం సిగ్గుతో చితికి పోతున్నారు. ఆత్మకూరు ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు గారి ప్రకటన ఒక్కటి చాలు – కాంగ్రెస్‌వాదన్న వాడు తలతీసి నేల మీద పెట్టు కోవడానికి! "సంజీవ రెడ్డి గారి పుణ్యం వల్లనే నేను ఎమ్మెల్యేగా గెల్చాను; ఆయన, ఆయన అనుచరులు ఎన్నికల్లో సహకరించి నన్ను గెల్పించారు; వారి సహాయం నేను మరువలేను" అన్నారు లక్ష్మయ్య నాయుడు గారు. ఈ ప్రకటన చేసింది కామిరెడ్డి పాడులో; అది సంజీవ రెడ్డి గారి స్వగ్రామం; ఆ సభ జరిపింది సంజీవ రెడ్డి గారి అల్లుడు బి. పట్టాభి రామిరెడ్డి; సభాధ్యక్షత సంజీవ రెడ్డి గారి శిష్య పరమాణువైన సర్పంచ్ రామాచారిది; సభాపర్యవేక్షణ – సంజీవ రెడ్డి గారి అనుచర ముఖ్యుడు, మాజీ ఎమ్మెల్యే శ్రీహరి నాయుడిది; పట్టీ సభ అనుకున్నారా దానిని? మేళ తాళాలు, కీలు గుర్రాలు, చెవులు చిల్లులు పొడిచే టపాసుల మోతతో లక్ష్మయ్య నాయుడిని జిల్ చేసేశారు.

ఎన్నికల్లో చేసిన ఓట్ల దొంగతనం ఇట్లా బయట పడి నందుకే సంజీవ రెడ్డి గారు తలదించుకొని, తెర వెనక్కు తప్పుకొని వుండాలి; కాని నిస్సిగ్గుగా తన అనుచరులు, బంధువుల చేత ఆ ఒక ఆ ఎమ్మెల్యేకి తన స్వగ్రామంలో రాచమర్యాద జరిపించి మరీ డిసిసి అధ్యక్షుణ్ణని చెప్పుకుంటున్నా రంటే – నాగభూషణం ఎటువంటి నిజాలు ముందుగా వూహించి చెప్ప గలిగాడన్పిస్తుంది!

జిల్లాలో కాంగ్రెస్ అభ్యర్థు లందరి గెలుపూ తన బాధ్యతగా స్వీకరించి, పని చేయవలసిన నాయకుడు – తన స్వంత నియోజక వర్గంలో కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించడం ఎంత నీచమైన విషయం? మొన్నటి పార్లమెంట్ ఎన్నికల్లో ఆత్మకూరులో పార్టీ మైనస్ కావడానికి సంజీవ రెడ్డి గారి విద్రోహమే కారణమని భావించాలి కదా? ఇంత విద్రోహానికి ఒడిగట్టిన వారి నేతృత్వంలో, ఆ విద్రోహం రుజువైన తర్వాత కూడా పని చేయగల్గడం జిల్లాలోని కాంగ్రెస్ వాదులకే చెల్లింది! నాకు ఒక అనుమానం – సిగ్గన్నది లేనిది ఆయనకా? వీరికా?

లక్ష్మయ్య నాయుడుని అంతగా

**డోలేంద్ర**

నెత్తికెక్కించుకొని వూరేగించ వలసిన అగత్యం డిసిసి అధ్యక్షుల వారికి ఇప్పుడెందుకు కల్గినట్లు? ఆత్మకూరు రీకో పదవి అల్లుడికి కట్టబెట్ట డానికి కాకా పడుతున్నారని దిన పత్రికలు వూహించాయి కాని, అది నిజం కాదని నా నమ్మకం. మరొక అల్లుడి దొంగ బిల్లు మంజూరుకు ఎమ్మెల్యే సిఫార్సు అవసరం ఏర్పడి నందువల్లే ఈ సత్కారం జరిపి వుండాలి!

కొరవ 7 పేజిలో

# 'దేవ'గౌడకాదు-'దెయ్యం'గౌడ!

### జలవివాదంపై జనార్ధనరెడ్డి అభిప్రాయాలు!

నెల్లూరు పర్యటనకు విచ్చేసిన మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఈసారి సభల్లో ఆల్మట్టి ప్రాజెక్టు విషయమే ఎక్కువగా ప్రస్తావిస్తూ మాట్లాడారు. జిల్లా ప్రజలందరికీ అర్థమయ్యేటట్లు పలు లెక్కలు, ఉదాహరణలు ఇచ్చారాయన. 12తేదీ నెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ ఆల్మట్టి ప్రాజెక్టులో దాగున్న రహస్యాలను మరింత లోతుగా వివరించారు. ఆల్మట్టి వివాదంలో ప్రధాన ముద్దాయి ప్రధాని దేవగౌడ. ఆయన దేవగౌడ; కాదు దెయ్యం గౌడ. 2వేల సంవత్సరం వరకు కృష్ణా మిగులు జలాలనుఎటువంటి స్థిరమైన కట్టడాలు నిర్మించు కోకుండా ఉపయోగించు కోవచ్చు; కాని దేవగౌడ బచావత్ అవార్డును తిరగ దోడి వివాదం సృష్టిస్తున్నారని విమర్శించారు. జలవివాదాలు సృష్టించడంలో దేవగౌడ సిద్ధహస్తుడని, ఆల్మట్టి వివాదం కర్నాటక, ఆంధ్ర ప్రదేశ్‌లకు సంబంధించినదైతే మహారాష్ట్ర ముఖ్యమంత్రిని అనవసరంగా చర్చలకు పిలిచారని వివరించారు. మూడు రాష్ట్రాలు వాద ప్రతివాదనలు చేసుకుంటే బచావత్ అవార్డును మార్చాలనేది దేవగౌడ దురాలోచన అని జనార్ధన రెడ్డి అభివర్ణించారు.

ఆల్మట్టిపై కేంద్ర ప్రభుత్వం ఒక శ్వేత పత్రం విడుదల చేయాలని దాని ద్వారా; ఏ ప్రభుత్వం, ఏ మంత్రి అధికార కాలంలో అనుమతులు మంజూరయ్యాయో ప్రజలు తెలుసుకో గలుగు తారన్నారు. ట్రిబ్యునల్ తీర్పులుండగా మరలా జలాల పంపకంపై రాష్ట్రాలు కొత్తగా కూర్చొని చర్చించడం అనవసర మన్నారాయన. ఆల్మట్టి నిర్మాణానికి బాండ్లు విడుదల చేయడానికి ప్లానింగ్ కమిషన్ ఏ విధంగా అనుమతిచ్చిందో అర్థం కావడం లేదన్నారు. జలాల పంపిణీకి రివర్ వ్యాలీ బేసిన్ అథారిటీని ఏర్పాటు చేసి, దానికి స్వయం ప్రతిపత్తిని కల్పించాలని జనార్ధనరెడ్డి సూచించారు. ఆల్మట్టి ఎత్తు పెంచే నిర్మాణాలు జరగకుండా అన్ని పార్టీలు కలసికట్టుగా పోరాటం చేయాలని సలహా యిచ్చారు.



# మునిసిపల్ కమిటీల్లో ఛైర్మన్‌కు గుండు సున్న!

నెల్లూరు మునిసిపాలిటీలో మూడు ప్రధాన కమిటీలను ఎన్నుకొనేందుకు 12తేది ప్రత్యేక సమావేశం జరిగింది. కాంట్రాక్ట్, ప్రధానోపాధ్యాయుల నియామకం, ఇతర పోస్టుల నియామక కమిటీలను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. ప్రతి కమిటీలో మునిసిపల్ ఛైర్మన్, కమీషనర్ కూడా సభ్యులు. కాంట్రాక్ట్ కమిటీలో కౌన్సిలర్లు పి. దేవదాసు, కె. లక్ష్మికుమారి, పి. జయమ్మ, ఎం. రమేష్, భానుశ్రీ, అరుణ కుమారి, శ్రీమన్నారాయణ ఎన్నికయ్యారు. ప్రధానోపాధ్యాయుల నియామకపు కమిటీలో ఖాజారహంతుల్లా, పి. లక్ష్మమ్మ, ఎన్. కనకయ్య, ఎన్. బుజ్జయ్య, నవమణి, గౌరీశంకర్, ఆసియా బేగం వున్నారు. ఇతర పోస్టుల నియామకపు కమిటీలో దేవరాజులు, పిచ్చిరెడ్డి, మాదాల వెంకటేశ్వర్లు, ఎ. రమణమ్మ, పిండి సురేష్, పిగిలం రంగయ్య, బండి సునీత సభ్యులు.

కమిటీ సభ్యుల్లో సిపిఎం కౌన్సిలర్లు 6మంది, టి.డి.పి కౌన్సిలర్లు 8మంది, కౌన్సిల్‌లో మాగుంట సైనికులుగా చెప్పుకుంటున్న కాంగ్రెసీయులు 7మంది ఎన్నికయ్యారు. కమిటీలో ఛైర్మన్ గ్రూపుకు గుండుసున్నా మిగిలింది ఎన్నికలయ్యాక విహా నంద రెడ్డి విలేకరులతో మాట్లాడారు. మునిసిపాలిటీలో కాంగ్రెసుకు బలం లేకపోవడంతో తాము పోటీచేయలేదని, ఎన్నికైన కొంత మంది కాంగ్రెస్ సభ్యులు వారి వ్యక్తిగత అభ్యర్థనలతో కమిటీల్లో చేరివుండ వచ్చున్నారు. మిత్రపక్షాలతో తమకున్న ఒప్పందం మేరకే ప్రతి కమిటీలో ఇద్దరు సిపిఎం కౌన్సిలర్లు వుండాలని నిర్ణయించి, ఆ మేరకు విజయం

### నెల్లూరు సంగతులు

సాధించినట్లు ఆ పక్ష నాయకుడు మాదాల వెంకటేశ్వర్లు చెప్పారు. కమిటీల్లో సభ్యత్వం కోసం మాగుంట సైనికులు తెలుగుదేశం, సిపిఎంతో కుమ్మక్కై, కాంగ్రెస్ పరువు తీశారు. ఆరెండు పార్టీలతో వీధుల్లో పోరాటాలు చేస్తూ, వారితో కలిసి పదవులు పంచుకోవడం తప్పుకాదా? ఎందుకింత పదవీ ఆరాటం?

### మునిసిపల్ రోడ్ల కోసం ప్రత్యేక గ్రాంటు!

రాష్ట్ర ప్రభుత్వం 25లక్షల రూపాయల ఇన్సెంటివ్ గ్రాంటును నెల్లూరు మునిసిపాలిటీకి విడుదల చేసిందని రాష్ట్ర మార్కెటింగ్ శాఖ మాత్యులు బి. రమేషరెడ్డి చెప్పారు.

కొరవ 7 పేజిలో

# పెంచలకోన అడవుల్లో నక్సలైట్లు

రాపూరుకు సమీపంలోని పెంచలకోన అడవుల్లో నక్సలైట్లు సంచరిస్తున్నట్లు విశ్వసనీయంగా తెలిసింది. ఇటీవల కాలంలో ఈ ప్రాంతంలో కనుమరుగై పోయిన నక్సలైట్లు వెంగిలి, తెగచర్ల, గరిమెనపెంట గ్రామాల్లో తిరిగి ప్రత్యక్షమయ్యారు. పెరిగిన సబ్సిడీ బియ్యం, కరెంట్ ఛార్జీలు, నీటి తీరువా పన్ను తమపై విపేధం తదితర అంశాలను వివరంగా రాత్రి వేళల్లో గ్రామస్తులను సమావేశపరచి వివరించారట. ఇటీవల కాలంలో ఈ ప్రాంతంలో నక్సలైట్లు ఉనికి లేదని ఊపిరి పీల్చుకొని, పోలీసులు నిఘా ఎత్తివేయడం వల్ల నక్సలైట్లు కొండ క్రింద గ్రామాల ప్రజలను రాత్రి వేళల్లో ఇబ్బంది లేకుండా కలవ గలుగుతున్నారు.

### బుచ్చి శారదా నికేతన్ సాహితీ కార్యక్రమం

బుచ్చిరెడ్డి పాళెంలోని శారదా నికేతన్ 8వ సాహితీ కార్యక్రమం 18తేది ఆర్యవైశ్య కళ్యాణ మండపంలో జరుగుతుంది. ఉదయం తెలుగు సౌరభాలు అనే అంశంపై కవి సమ్మేళనం, మధ్యాహ్నం గ్రంథావిష్కరణ సభ ఏర్పాటయ్యింది. సాయంత్రం కోట రాజశేఖర్ అష్టావధానాన్ని నిర్వహిస్తారని శారదా నికేతన్ అధ్యక్షులు వి.రాఘవయ్య తెలియజేస్తున్నారు.

### పొట్టేపాళెంలో వైద్యశిబిరం

నెల్లూరు పినాకిని, మందాకిని లయన్స్ క్లబ్బుల సంయుక్త ఆధ్వర్యంలో నెల్లూరు రూరల్ మండలం పొట్టెపాళెం గ్రామంలో 28 తేది ఉచిత వైద్య శిబిరం జరిగింది. డాక్టర్లు కె.ఎస్.జి. హెబ్బార్, పి.వి. నరసింహ శాస్త్రి, పి. వెంకటేశ్వర రావు, ఎం.ఎస్. రెడ్డి, పి. భారతి 1500 మంది రోగులను పరీక్షించారు. అవసరమైన వారికి ఉచితంగా మందులు పంచి పెట్టారు. కార్యక్రమంలో క్లబ్ అధ్యక్ష, కార్యదర్శులు జి. బాబయ్య, పి. రాజగోపాల్, క్యాంప్ ఛైర్మన్ జి. తిరు నారాయణ, మందాకిని క్లబ్ అధ్యక్షులు, కార్యదర్శులు పి. రాజ్యలక్ష్మి, జి. లక్ష్మి పాల్గొన్నారు. లయన్ జాఫర్‌సా, గ్రామస్తుడు కె. యల్లారెడ్డి శిబిరం విజయవంత మయ్యేందుకు సహకరించారు.

## జిల్లావార్తలు

### గొలగమూడి ఆరాధనోత్సవాలు

ఈనెల 22, 23, 24 తేదుల్లో గొలగమూడి వెంకయ్య స్వామికి ఆరాధనోత్సవాలు జరుగుతున్నాయి. ఈ సందర్భంగా విచ్చేసే బ్రాహ్మణ భక్తులకు ఉచితభోజన వసతిని నెల్లూరు దర్గామిట్టలోని బ్రాహ్మణ అన్న దాన సమాజం ఏర్పాటు చేస్తున్నది. బ్రాహ్మణేతరులు వస్తే అన్నం పెట్టరా? బ్రాహ్మణులని గుర్తించ డానికి ఏ గుర్తు చెప్పాలి మీకు?

# రాపూరు చందనం ఛేజ్ చేసి పట్టారు!

ఎప్పుడూ నిద్ర మత్తులో జోగుతుండే రాపూరు అటవీ శాఖాధికారులు గతవారం అకస్మాత్తుగా మత్తు వీడారు. రాపూరు అటవీ శాఖ కార్యాలయానికి వచ్చిన ఒక టెలిఫోన్ సందేశం విని వెంటనే అప్రమత్తంగా వ్యవహరించడంతో రెండు లక్షల రూపాయల విలువైన ఎర్ర చందనం పట్టుకో గలిగారు. రాపూరు అడవుల్లో నరికిన చందనం దుంగలు ఒక టెంపో వ్యాన్‌లో తరలిస్తుండగా, మాదిరి ఛేజ్ చేసి పట్టుకున్నారు. లారీలకు లారీల కొద్ది చందనం తరలి పోతున్నా నిమ్మకు నీరెత్తినట్లుండే అధికారులు ఈ సాహసం ఎందుకు చేశారో అర్థంకాక ప్రజలు తలలు పట్టుకొంటున్నారు. అదే ధోరణిలో అటవీ శాఖ మెలకువగా వుంటే చందనం దుంగల స్మగ్లింగ్ దానంతటదే ఆగిపోతుంది.

### వెన్నెలకంటి శత జయంతి ఉత్సవం

గిరిజనుల కంటి వెలుగుగా, నెల్లూరు గాంధీగా పేరు గాంచిన వెన్నెల కంటి రాఘవయ్య శత జయంతి ఉత్సవాన్ని కావలిలోని యూనివర్సిటీ సర్వీసెస్ సంస్థ నిర్వహించింది. మాజీ ఎమ్మెల్యే మాధవరావు ఈ సందర్భంగా మాట్లాడుతూ ఒక వైపు స్వాతంత్ర్య పోరాటం, మరో వైపు జమిందారీ వ్యతిరేకోద్యమం జరుగుతున్న రోజుల్లో రెండు పోరాటాల్లోనూ వెన్నెలకంటి పాల్గొన్నట్లు చెప్పారు. గిరిజనుల శ్రేయస్సు కోసం కృషి చేసిన ఈనెల్లూరు గాంధి సేవలను భావితరాలకు తెలియ చేయమని యూనివర్సిటీ సర్వీసెస్ సంస్థను కోరారు. వెటర్నరీ డాక్టర్ డి. వాసుదేవ రావు, సంస్థ సభ్యులు సభలో మాట్లాడారు.

### గూడూరు మండలాధ్యక్షురాలికి నచ్చిన పద్ధతి

# 'మౌనమే నాభాష ఓ మూగమనసా'

నోరు తెరిస్తే ముత్యాలు రాలి పోతాయన్న తీరులో గూడూరు మండలాధ్యక్షురాలు ప్రవర్తిస్తుంటారు. మండల సమావేశాల్లోగాని, ఆఫీసు పరిసర ప్రాంతాల్లో గాని పొర పాటున కూడా నోరు తెరచి మాట్లాడరామె. సర్పంచులు, ఎమ్పీటిసి సభ్యులు ఏవైనా ప్రశ్నలువేస్తే ఎమ్డీఓ వైపు తిరిగి చూస్తారు. 13తేది జరిగిన మండల సమావేశంలో రోజ్‌గార్ నిధులు, ఉపాధ్యాయుల నియామకంపై కాంగ్రెస్, తెలుగు దేశం సభ్యుల మధ్య వాగ్వివాదం తీవ్రమైన రచ్చ జరిగింది. అయినా మండలాధ్యక్షురాలు దాసరి చిన్న రమణమ్మ మౌనమే నా మూగభాష ఓ మూగ మనసా అన్నట్లు కూర్చొండి పోయారు. చెన్నూరు గ్రామానికి చెందిన మండలాధ్యక్షురాలు, ఆ గ్రామస్థుడైన ఎమ్మెల్యేతో మాత్రమే నోరువిప్పి మాట్లాడుతుంది. ఆయన చెప్పిన విషయాలను అదే పదాలతో ఎమ్డీఓకు చెబుతుంది తప్ప మరే విషయాల్లో జోక్యం చేసుకోదామె. మండలాధ్యక్షురాలి తీరుపట్ల మండల కార్యాలయంలోని సిబ్బంది హర్షం వ్యక్తం చేస్తుంటారు.

### నెలాఖరుకు తెలుగుగంగ పనులు పూర్తి

ప్రభుత్వం అనుకొన్నట్లు గానే అగస్టు నెలాఖరుకు తెలుగు గంగ ప్రాజెక్ట్ పనులు పూర్తవు తాయని ప్రాజెక్ట్ ఎస్.ఇ పి.కె మనోరంజన్ చెప్పారు. సోమశిల ఎస్.ఇ గా కూడా అదనపు బాధ్యతలు స్వీకరించిన మనోరంజన్ సోమశిల ప్రాజెక్ట్ అతిధి గృహంలో విలేకరులతో మాట్లాడుతూ సోమశిల నుండి కండ్లేరు వరకు గల తెలుగు గంగ పనులన్నీ పూర్తయ్యాయి. కాల్వ లీకేజి కారణం - భద్రత కోసం అమర్చిన ఐప్ పోల్స్‌లో పోరస్ బ్లాకులే నన్నారాయన. వాటిని మూసివేయడం ద్వారా లీకేజి అరికట్టామన్నారు. తెలుగు గంగకు నిధుల కొరత లేదని, తమిళనాడు 25కోట్లు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 7కోట్లు విడుదల చేసినట్లు వివరించారు. కండలేరు ప్రాజెక్ట్ నుండి పూండి రిజర్వాయర్ వరకు ఫాగే 128 కిలోమీటర్ల కాల్వ పనులు త్వరిత గతిన పూర్తి చేస్తున్నట్లు చెప్పారు. సోమశిలలో 316 కాంటూరు వరకు నీరు నిల్వ వుంచే విధంగా ముంపు గ్రామాల వారిని ఖాళీ చేయిస్తున్నట్లు తెలియజేస్తూ, కుడుములూరు గ్రామానికి కోటి 60లక్షల రూపాయలు నష్టపరిహారం చెల్లించనున్నట్లు వివరించారాయన. ఈ సందర్భంగాతెలుగు గంగ కాల్వలో ఏర్పడిన లీకేజిని కూడా మనోరంజన్ పరిశీలించారు.

# పన్నులు పెంచడం సోపంసిఎంకు ఇష్టమే లేదట

అనంతసాగరం మండలం కామిరెడ్డి పాడులో నిర్మించిన పక్కా ఇళ్లను, ఉన్నత పాఠశాలలోని అదనపు గదిని ఆత్మకూరు ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు ప్రారంభించారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో మాట్లాడుతూ పన్నులు, ధరలు పెంచడం ముఖ్య మంత్రికి ఇష్టం లేకున్నా రాష్ట్ర ఆర్థిక పరిస్థితి దృష్ట్యా పెంచక తప్పలేదన్నారు. సోమశిల ఉత్తర కాల్వ నాయుడు, మార్కెటింగ్ సొసైటి మాజీ అధ్యక్షుడు బి. పట్టాభిరామిరెడ్డి, సర్పంచ్ రామాచారి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### ఆత్మకూరు ఎమ్మెల్యే ఉవాచ

రైతుల అవసరాలను ముఖ్య మంత్రి దృష్టికి తీసుకెళ్లి సాగునీరు విడుదల చేసేందుకు కృషి చేస్తున్నట్లు చెప్పారు. డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి తనకు రాజకీయ గురువని, చేజర్ల సమితి అధ్యక్షునిగా రాణించడానికి ఆయన సలహాలే కారణమన్నారు. తనకు సంజీవరెడ్డికి గల అనుబంధంతో గత అసెంబ్లీ ఎన్నికల్లో ఆయన అనుచరులు తనకు మద్దతు ప్రకటించినట్లు చెప్పారు. ఆత్మకూరు మాజీ ఎమ్మెల్యే శ్రీహరి

# ఫోన్లు పనిచేయకున్నా బిల్లులు మాత్రం తప్పవు!

కోట టెలిఫోన్ ఎక్స్ఛేంజి పరిధిలోగల విద్యా నగర్ టెలిఫోనులు గత ఆరునెలలుగా మూగ బోయాయి. ఎన్నోసార్లు టెలిఫోన్ శాఖ ఉన్నతాధికారులకు ఈ విషయమై ఫిర్యాదుచేసినా ఫలితం లేకుండా పోయిందని వినియోగ దారులు వాపోతున్నారు. మార్చి నెలలో విద్యానగర్‌లో టెలిఫోన్లకు కొత్త కోడ్ నెంబర్లు ఇచ్చి టెలిఫోన్ కనెక్షన్లు ఇచ్చారు. వీటన్నింటిని సబ్ స్టేషన్ వద్ద వున్న కాన్‌సెన్‌ట్రేషన్ బాక్సుకు కలిపారు. పది రోజుల పాటు కూడా ఈ కొత్త ఫోన్లు పనిచేయలేదు. ఏర్పాటు చేసిన కాన్‌సన్‌ట్రేషన్-బాక్సుకు 30 కనెక్షన్లను భరించే స్థాయి లేకపోవడం వల్ల ఈ దుస్థితి దాపురించింది. ఈ పరిస్థితిని చక్కదిద్దను, వినియోగదారులను సమాధాన పరచను కోట ఎక్సేంజిలో

### విద్యానగర్ వినియోగదార్ల లబోదిబో

ఎ.ఇ కూడా లేరు. 5నెలల క్రితం ఆయన బదిలీ అయ్యారు. ఫోన్లు పని చేయకపోయినా, బిల్లులు మాత్రం యధావిధిగా వస్తున్నాయి. టెలిఫోన్ డిపార్టుమెంటు నిర్లక్ష్యం కారణంగా విద్యానగర్‌లోని కాలేజీలు, పోస్టాఫీసు, విద్యుత్ సబ్ స్టేషన్, ఆంధ్రాబ్యాంక్ వంటి ముఖ్యమైనఫోనులు మూగబోయి వున్నాయి. నెల్లూరు జిల్లా టెలిఫోన్ మేనేజర్ ఈ విషయమై కాసింత శ్రద్ధ వహించి పరిస్థితి చక్కదిద్దాలని విద్యానగర్ టెలిఫోన్ వినియోగదారులు కోరుతున్నారు.

# సర్కారు తంతుగా స్వాతంత్ర్య దినం!

స్వాతంత్ర్య దినోత్సవ మనబడే సర్కారు మొక్కుబడి తంతు ఆగస్టు 15తేది నెల్లూరు పోలీసు గ్రౌండ్‌లో యధా ప్రకారం జరిగి పోయింది. అంతా యాంత్రికమే. రాష్ట్ర మంత్రి హోదాలో రమేషరెడ్డి పోలీసు గౌరవ వందనాన్ని స్వీకరించి, జాతీయ పతాకాన్ని ఆవిష్కరించడ మొక్కటే కొత్త సంగతి. జిల్లా అభివృద్ధి పనుల మీద జిల్లా యంత్రాంగం తయారు చేసిచ్చిన నివేదికను ఉగ్గబట్టి 15నిమిషాల్లో చదివి పారేశారాయన. జిల్లాలోని ఇతర ఎమ్మెల్యేలకు తీరిక లేకపోవడం వల్ల ఈ కార్యక్రమానికి వచ్చినట్లు లేదు! తెలుగుభాష అమలుకు ప్రత్యేక సంఘాన్ని ఏర్పాటు చేసి ప్రభుత్వం పాకులాడు తుంటే, అదేమిటో మన అధికారులకు 'శ్వేతభాషే' రుచి. అవార్డు అందుకొన్న అధికారుల పనితీరు గూర్చి జనానికి అర్థం కాని ఇంగ్లీషులో కష్టపడి చెప్పే బదులు స్పష్టంగా తెలుగులో చెబితే ఏమి పోతుందండి? గ్రౌండులో రెవిన్యూ సిబ్బంది తగినన్ని షామియానాలు వేయలేదు. దీనివల్ల పసిపిల్లలు ఎండలో కూర్చోవాల్సి వచ్చింది. పెరేడ్ గ్రౌండ్‌లో ఇదివరకు కమ్మల పందుగగా మువ్వన్నెల తోరణాలు కనపడేవి. ప్రభుత్వ పొదుపు చర్యల మూలంగానేమో, అవి అదృశ్య మయ్యాయి. ఎక్కడివో పాత జెండాలు తెచ్చి నామ మాత్రంగా పాతిపెట్టారు. మంత్రి అధికారికంగా కార్యక్రమం నిర్వహిస్తుండే సరికి ఈసారి కలెక్టర్ విఐపిల గ్యాలరీలో ప్రేక్షకుడయ్యారు. గ్యాలరీలోకి ఛోటా తెలుగు నాయకులు చొచ్చుక రావడాన్ని రెవిన్యూ సిబ్బంది అరికట్టలేక పోయారు. ప్రతి స్వాతంత్ర్య దినోత్సవ వేడుకకు తప్పనిసరిగా హాజరయ్యే డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు పెరేడ్‌లో ప్రత్యేక ఆకర్షణగా నిలిచారు. ఉత్తమ సేవలందించారని ఎంపిక చేసిన 181 మందిలో కొందరి గుణగణాలపై వారు సర్టిఫికెట్లు తీసుకొంటుండగానే వారి సహచరులు వ్యాఖ్యాని స్తుండినారు.

### పాత సంగతుల ప్రసంగాలు – అదృశ్యమైన జెండా తోరణాలు

కొరవ 8 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు
### విహారకుడు

## 4 కోట్ల భూకుంభకోణం?

నెల్లూరు, పొదలకూరు రోడ్డులో అత్యంత విలువైన 164 ఎకరాల భూమిని ఆక్రమించు కోవడానికి కొందరు కాంగ్రెస్ వారలు పెద్ద కుంభకోణం నడిపిస్తున్నట్లు తెలుస్తోంది. దీని విలువ 4 కోట్ల రూపాయల వరకు వుంటుందట. టౌన్‌లో బలియుణ్ణైన కాంగ్రెస్ కుటుంబం ఒకటి దీనికి సారథ్యం వహిస్తున్నదని; తెలుగు మంత్రి సహకారం కూడా అర్థిస్తిం వున్నారని; ఎమ్మార్వో వంటి రెవిన్యూ అధికారులపై ఒత్తిడి తెచ్చి ఆక్రమణకు అధికార ముద్ర వేయించుకో బోస్తున్నారని చెప్తున్నారు. ఈ భూ బకాసురుల కథా కమామీషు పైవారం ముచ్చటించు కుందాం.

## పార్వతమ్మకు పదవి

ఒంగోలు పార్లమెంట్ సభ్యురాలు శ్రీమతి మాగుంట పార్వతమ్మ గారిని దక్షిణ మధ్య రైల్వే సలహా మండలి సభ్యురాలుగా నియమించారు. పార్లమెంట్ సభ్యులతో కూడిన కమిటీ ఇది.

## గునుపాటికి అనారోగ్యం

పాత తరం పెద్ద కాంట్రాక్టరు, మాజీ శాసన మండలి సభ్యురు, అభ్యుదయ రైతుగా అభివర్ణించ దగిన భూస్వామి శ్రీ గునుపాటి రామచంద్రా రెడ్డి గారి ఆరోగ్యం అదుపు తప్పింది. రెండేళ్ల క్రితం కడుపులో పెరుగు తుండిన ఒక ట్యూమర్‌ను తొలగించా రాయనకు. అప్పటి నుంచి మితాహారం స్వీకరించ వలసి రావడం వల్ల బాగా నీరస పడిపోయారు. అందులోనూ ఆయన వయస్సు 80 సంవత్సరాలు. నెల్లూరు టౌన్‌లోని ఇంటిదగ్గర డాక్టర్లు చికిత్స చేస్తున్నారు. ఇప్పుడు నెమ్మదిగా వుంది.

రామచంద్రారెడ్డిగారు త్వరలో సంపూర్ణ ఆరోగ్యవంతులు కావాలని ఆకాంక్షిస్తున్నాము.

## సోమశిలకు కాంగ్రెస్ బృందం

తెలుగు గంగ ప్రాజెక్ట్ పనుల పరిశీలన కోసం హైదరాబాదు నుంచి కాంగ్రెస్ నాయకుల బృందం ఒకటి సోమశిలకు వచ్చింది. మాజీ మంత్రులు డాక్టర్ ఎం.వి. మైసూరారెడ్డి, శ్రీ డి.కె. సమరసింహారెడ్డి, ఎమ్మెల్యే శ్రీ గంగుల ప్రతాప్‌రెడ్డి తదితరులు విలేఖరులను వెంట బెట్టుకొని వచ్చారు. సోమశిలలో వారిని నెల్లూరు నాయకులు శ్రీ జాకె రెడ్డి, శ్రీ సివి శేషా రెడ్డి, డాక్టర్ బి. సుందర రామిరెడ్డి తదితరులు స్వాగతించారు. తెలుగు గంగ పథకం క్రింద రాయలసీమ, నెల్లూరు జిల్లాలలోని భూములకు సాగు నీరు ఇవ్వకుండా, మద్రాసుకు మంచి నీరు పంపించ డానికి చంద్ర బాబు ప్రయత్నం చేస్తున్నారని విమర్శించారు వారు. తర్వాత ఈ బృందం కండ్లేరు రిజర్వాయర్‌నూ సందర్శించింది.

మొదటి అదనపు డిస్ట్రిక్టు మున్సిఫ్ వారి కోర్టులో
S.C.No: 125/95
మెసర్సు శ్రీ సాయిరామ్ ఫైనాన్సియర్స్
Rep. by its మేనేజింగ్ పార్టనర్ ఏ.రమేష్‌బాబు, నెల్లూరు... వాది
Vs
బి. నాగేశ్వరరావు... ప్రతివాది
To బి. నాగేశ్వరరావు
సౌత్ సెంట్రల్ రైల్వేస్
4-D: రైల్వే క్వార్టర్సు, నెల్లూరు.
నోటీసు
పై దావాలో మీ నుండి బాకీ సొమ్ము రాబట్టుటకు కోర్టు వారు సమను నోటీసును 22-8-96వ తేదికి వాయిదా వేసియున్నారు. కావున పై కోర్టులో 22-8-96వ తేది ఉదయం 10-30 గంటలకు వాయిదాకు హాజరు అయి ఆక్షేపణలున్న యెడల తెలుపుకోవలసినది లేని యెడల పరోక్షంగా తీర్మానించబడును.
యస్. శ్రీరాములు B.Com.,B.L
వాది తరపున న్యాయవాది

## సోమశిల నీళ్లు – జాకె రెడ్డి ఉద్యమం

రాజకీయ వాదులకు ఇది జల సిజన్‌గా వున్నట్లుంది. ఒక్కొక్కరు ఒక్కొక్క సబ్జెక్టుపై ఆందోళన చేపడుతున్నారు. మాజీ శాసన సభ్యుడు శ్రీ జాకె రెడ్డి సోమశిల నీళ్లపై పెత్తనం నెల్లూరు రైతాంగానికే వుండాలనే నినాదంతో ఒక ఉద్యమం ప్రారంభించారు. మద్రాసుకు నీళ్లివ్వ డానికి ప్రస్తుతానికి సోమశిల బ్యాలన్సింగ్ రిజర్వాయర్ పని వుపకరి స్తున్నందు వల్ల దీని నుంచి నీటిని తన అనుమతి తీసుకోకుండా ఎవ్వరూ వాడరాదని ఆదేశ మిచ్చారట ముఖ్య మంత్రి.

ఇది అన్యాయం! సోమశిలకు, మద్రాసు కిచ్చే తెలుగు గంగ నీళ్లకు సంబంధం లేదు. సోమశిల పూర్తిగా నెల్లూరు జిల్లా రైతుల స్వంతం. దీనిపై పరాయి పెత్తనాన్ని, ఈ నీళ్లు మద్రాసుకు పంపడాన్ని అనుమతిస్తే ముందు ముందు నెల్లూరు రైతులు చాలా నష్టపోవలసి వస్తుంది. అందువల్ల మొగ్గలోనే ఆ ప్రయత్నం తుంచి వేయడం మంచిదనే వుద్దేశ్యంతో జాకె రెడ్డి ఆందోళనా కార్యక్రమం ప్రకటించారు. రేపు 26 తేది నెల్లూరులో ఒక అఖిల పక్ష సమావేశం జరిపి, రైతుల నందరినీ ఉద్యమోన్ముఖులను చేస్తారట.

## సారథి గారు



జమీన్‌రైతు పత్రిక నిర్వహణలోనే తన జీవిత మంతా గడిపి అదే ధ్యాసలో మరణించిన తూపిలి పార్థసారథి గారు కన్నుమూసి రేపు 20 తేదితో పదహారేళ్లు పూర్తవుతాయి. ఆయన్ను సంస్మరిస్తూ ఆయన స్మృతికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

– జమీన్‌రైతు కుటుంబం

## నెల్లూరు రైల్వేస్టేషన్‌కు ఎమ్పీ బహూకృతి

నెల్లూరు రైల్వే స్టేషన్‌లో గ్లోబల్ కంప్యూటర్ రిజర్వేషన్ పద్ధతి ప్రారంభమౌ తున్నది. రేపు (17 తేది) ఉదయమే దీనికి రిబ్బను కత్తిరింపు. దీని వల్ల నెల్లూరు నుంచి దేశంలోని ఏ స్టేషన్ టిక్కెట్ అయినా కొనవచ్చు. ఢిల్లీ, బొంబాయి, కలకత్తా నగరాలతోనూ నెల్లూరుకు సంబంధం ఏర్పడు తుంది. పార్లమెంట్ సభ్యురాలు శ్రీమతి పనబాక లక్ష్మి సాధించుకొని వచ్చిన ఉపకారం ఇది. ఆమెకు నెల్లూరీయు లందరూ థ్యాంక్స్ చెప్పాలి.

## నెల్లూరు క్లబ్ ఎన్నికలు

నెల్లూరు క్లబ్‌కు 15 తేది జరిగిన ఎన్నికల్లో శ్రీ నిడిముసలి రామసుబ్బా రెడ్డి మంచి మెజారిటీతో గెల్చారు. ఆయనకు 125 ఓట్లు, ప్రత్యర్థి శ్రీ ఆనం బుల్లా రెడ్డికి 71 ఓట్లు వచ్చాయి. ఉపాధ్యక్షుడుగా శ్రీ ఎన్. జనార్ధన్ రెడ్డి, కార్యదర్శిగా శ్రీ టి. హరిశ్చంద్రా రెడ్డి గెలుపొందారు.

నెల్లూరు క్లబ్ మరీ పేకాట గృహంగా మారిపోయి వుంది. కొంచెం ఆటపాటలకు కూడా చోటు కల్పించండి సార్!

## డాక్టర్ కొండూరు రామకృష్ణమూర్తి మృతి

నెల్లూరు టౌన్‌లో తొట్టతొలి అలోపతి డాక్టర్ల తరానికి చెందిన డాక్టర్ కొండూరు రామకృష్ణ మూర్తి (85) 10 తేది నెల్లూరులో మరణించారు. సింహపురి నగరం ఒక సేవానిరతి కల్గిన వైద్యుణ్ని కోల్పోయింది.

అరవయ్యేళ్ల క్రితం వరకు నెల్లూరులో ఎవరికి వైద్యం అవసరమైనా రామకృష్ణ మూర్తి దగ్గరకే పరుగు పెట్టేవారు. 1936 నుంచి 60 ఏళ్లపాటు నెల్లూరు పౌరులకు తన వైద్య సేవలందించా రాయన. వైద్య శాస్త్రం పెద్దగా అభివృద్ధి చెందని ముందు నాళ్లలో తెలియని ఆ రోజుల్లో ఆయన చేయి పడగానే ఎంత పెద్ద రోగమూ పిల్లిలా పారిపోయేది. ఆయన హస్తవాసి అటువంటిది. ప్రభుత్వ పెద్దాస్పత్రిలో చాలా దశాబ్దాల పాటు ఆయనే గౌరవ సర్జన్. రోగుల పట్ల ప్రేమ, ఆదరణ,

కొరవ 7 పేజీ

In The Court of the District Judge, Nellore.
OP.No: 351/96
In the matter of Palavadhi Venkata Lakshmi Sandya Rani being minor rep. by her father and Natural Guardian
Palavadhi Sreeramulu ... Petitioner
నోటీసు
పైనంబరున పిటీషనరు మైనరు అయినందున గార్డియన్‌గా పాలవాది శ్రీరాములు పిటీషను దాఖలు చేసి సదరు మైనరు తాలూకా ఆస్తులను అమ్మవలయునని కోర్టులో పిటీషను దాఖలు చేసియున్నారు. సదరు పిటీషను మీద కోర్టువారు నోటీసు ఉత్తర్వు చేసి వాయిదా 23-8-96కు వేసియున్నది. ఎవరికైనా ఆక్షేపణలున్న ఎడల ఆరోజు కోర్టుకు ఉదయం 10-30 గంటలకు హాజరయి మీ ఆక్షేపణలను తెలుప కోవలయును. లేనిచో పరోక్షమున తీర్మానించబడును.
SM. Saida
SM. Subani
పిటీషనరు న్యాయవాదులు





## సంస్మరణ

మా అభివృద్ధికి కారకులు, మా తండ్రి

### గున్నంరెడ్డి సుందరరామిరెడ్డి గారు

పరమపదించి 17-8-96 తేదికి ఏడు సంవత్సరాలు పూర్తయినవి.
సప్తమ వర్థంతి సందర్భముగా వారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

డా. జి. కొండారెడ్డి, డెంటల్ సర్జన్, నెల్లూరు

జి. రఘురామిరెడ్డి

## కడుపుమంటలు

1 పేజీ తరువాయి

ఎన్నికోవడానికి పోటీలు పడుతున్నారు. అయితే రైతులు వారి కోసం ఎదురు చూడడం లేదు; వారు ఇప్పినంటే అర్థాంతర పెట్టడం లేదు.

ఈ మంటలను ఆర్పే ధోరణి మందగిస్తే తన ప్రభుత్వానికి చితి మంటలుగా పరిణమిస్తాయని భయపడి, వాటిని చల్లార్చడానికి చంద్రబాబు శతథా ప్రయత్నిస్తున్నారు. విద్యుత్, నీటితీరువా ఛార్జీలను కొద్ది కొద్దిగా తగ్గించారు. కాని రైతులు అందుకు సంతృప్తి పడలేదు.

ఒకేసారి ఆరునుంచి పది రెట్లుగా ఛార్జీలు పెంచడం రైతాంగం జీర్ణించుకోలేక పోతున్నారు. వీటిని ప్రతిఘటించకుంటే, రద్దు చేయించకుంటే వ్యవసాయం వదులుపెట్టి, గ్రామాలు వదలి వెళ్లవలసి వస్తుందని భయపడి పోతున్నారు. ప్రతిరైతు గుండెలో ఈ గుబులు రౌద్రంతో తెగింపు ధోరణితో వీధిన పడుతున్నారు వారు.

తెలుగుదేశం ఎమ్మెల్యేలు, అధికారులు గ్రామాలకు వెళ్లి వారికి నచ్చ చెప్పాలని ముఖ్యమంత్రి చేసిన ఆదేశం నిష్ఫలమై పోయింది. నచ్చ చెప్పుమాట దేముతెరుగు, పెండ్లికో పబ్బానికో పల్లెటూళ్లకు పోవాలన్నా, శాసన సభ్యులకు ధైర్యం చాలడం లేదు. ఎక్కడ ఎవరు నిలేసి, తమను ఘెరావ్‌లో పెట్టేస్తారోనని వాదలి వస్తున్నారు వారు.

చంద్రబాబు అప్పుడు వెనక్కు పోలేదు; ముందుకు రాలేదు. పెంచిన విద్యుత్ ఛార్జీలు, నీటి తీరువా రద్దు చేస్తే ఖజానా మళ్లీ దివాలా తీస్తుంది; మద్య నిషేధం, సబ్సిడీ బియ్యం జోలికి వెళ్తే మరొక ఉద్యమం పుట్టుకు వస్తుంది. రైతుల ఉద్యమాన్ని అర్థే పరిలోస్తే తెలుగుదేశం పార్టీ భూస్థాపితమై పోతుందన్న భయం. ఏమి చేయాలో, ఎట్లా సమస్యను నెట్టుకు రావాలో అర్థంకాక పిచ్చి పట్టినట్లు పిచ్చెక్కుతున్నారు తెలుగు నాయకులు.

ఆలమట్టి సమస్య పైలం అగ్గి వుంది. దేవగౌడ ససేమిరా చంద్రబాబు మాట వినిపించు కోవడం లేదు; ఏమాత్రం రాజీ పడడం లేదు. ముఖ్యమంత్రుల కమిటీ పంపిన నిపుణుల బృందం ఆలమట్టికి వెళ్లకుండా అడ్డగించి వెనక్కు పంపడం ద్వారా - కర్ణాటక నాయకులు కయ్యానికి కాలుదువ్వారు. తెగే వరకు లాగేటట్లుంది వారి వైఖరి. దేవగౌడతో తెగతెంపులు చేసుకోక తప్పని పరిస్థితులు ఏర్పడు తున్నాయి. రాష్ట్రంలో ఇప్పుడున్న పరిస్థితులలో దేవగౌడను పడగొట్టి మధ్యంతర ఎన్నికలు రప్పించినా ప్రమాదమే; ఒంటరిగా బయటపడి, జాతీయ రాజకీయాలలో ఒంటరిగా నిలబడినా ప్రమాదమే. పాపం చంద్రబాబుకు చేటుకాలమిది!

## నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

మునిసిపల్ పరిధిలో గత సంవత్సరం 85 శాతం పైగా పన్నులు వసూలు చేసినందుకు ప్రోత్సాహంగా ఈ నిధులు మంజూరు చేసినట్లు వివరించారు. వీటిలో 3.44లక్షల రూపాయలతో 1400 చ.మీ మేరకు ఎసి సుబ్బారెడ్డి విగ్రహంచుట్టూ వేసే సిమెంటు రోడ్డు పనిని మంత్రి ప్రారంభించారు.

### ఇందిరాభవన్‌లో రెండో అంతస్తు నిర్మాణం

ఇందిరా భవన్ ట్రస్టు 9వ తేది జరిగిన ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దనరెడ్డి అధ్యక్షతన సమావేశమై ఇందిరా భవన్ ట్రస్టు వద్ద లక్షరూపాయల మిగులు వుందని కమిటీ అధ్యక్షులు ఓ.వి. రమణారెడ్డి చెప్పారు. ఈ ఆక్షేప ప్రారంభ పెట్టుబడిగా పెట్టి మరో 10లక్షల రూపాయలను దాతల నుంచి సేకరించి ఇందిరా భవన్‌పై మరో అంతస్తు నిర్మించాలని తీర్మానించారు.

### తెలుగు యువత ఇన్‌ఛార్జి కూరపాటి ఈశ్వరరెడ్డి

రాష్ట్ర తెలుగు యువత కార్యవర్గ సభ్యుడు, మునిసిపల్ కౌన్సిలర్ కూరపాటి ఈశ్వరరెడ్డిని జిల్లా తెలుగు యువత ఇన్‌ఛార్జిగా నియమించారు. ఈ నియామకాన్ని తెలుగు యువత రాష్ట్ర అధ్యక్షుడు నందమూరి హరికృష్ణ చేశారు జిల్లాలోని మండల, పట్టణ స్థాయి కమిటీలను ఏర్పాటు చేయడానికి ఈ పదవి ఇచ్చారు. ఈశ్వరరెడ్డి, ఇటీవల కొత్తగా ఏర్పడిన హరికృష్ణ అభిమాన సంఘం సభ్యుడు.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

వాత్సల్యం వెల్లివిరిసేవి ఆయనలో! పేదవారైనా, ధనికులైనా ఒకే తీరుతో ఆదరించేవారు. పొరపాటున కూడా ఎప్పుడూ ఎవర్నీ ఫీజు అడిగేవారు కాదు. రోగికి నచ్చి, పావలో, అర్థ రూపాయో ఇస్తే తీసుకొనే వారు. మందులు, ఇంజెక్షన్లు ఉచితంగా పంచి పెట్టేవారు. అందువల్లే ఆయన అభిమానులను తప్ప, ఆస్తిపాస్తులను ఆర్జించ లేదు. ప్రాక్టీసు తొలి రోజుల్లో కాచే పుండకే దాయనకు. చివరి రోజుల్లో రిక్షాలో ఇల్లిల్లు తిరిగి, రోగులకు ఉచిత వైద్యం చేసేవారు. ఆయన వాకిట్లో రిక్షా దిగగానే జ్వరం తగ్గిపోయి నంత రిలీఫ్ కల్గేది.

రామకృష్ణ మూర్తి గారు దైవభక్తులు! నిరంతరం గాయత్రి మంత్రం జపిస్తూండేవారు. మరణ సమయంలోనూ ఆ జపం స్మరిస్తూనే కన్నుమూశారు. ఆయనకు ముగ్గురు కుమారులు, నలుగురు కుమార్తెలు. వారిద్వారా వైద్య విద్య సభ్యసించక పోవడం విచారకరం.

డాక్టరు గారు జక లేరంటే మనసు బాధగా వుంది. ఆయన వంటి సేవానిరతి, త్యాగ గుణం, మానవీయత, వాత్సల్యం, కల్గిన వైద్యుణ్ని ఇక జీవితంలో చూడలేము. వారి కుటుంబానికి మా సానుభూతి.

### డిఎస్‌పి వివరణ

గతవారం జిల్లా పౌర సరఫరాల కార్యాలయంపై వ్రాసిన వార్తకు డిఎస్‌పి శ్రీ భరత్ రెడ్డి గారు సుదీర్ఘ వివరణ పంపారు! స్థలం చాలినంత లేదు; పై వారం ప్రచురిస్తాం.

**నెల్లూరు బజారు**

| మొలగొలుకులు | |
|---|---|
| 9672 | 4200/- |
| 9674 | 4800/- |
| సన్నాలు క్రొత్తవి | 3600/- |
| 5656 | 3800/- |

## తామరపువ్వు

11 పేజీ తరువాయి

నేను దాతను కాదు స్వీకర్తనని సభికుల హర్షధ్వానాల మధ్య ఉపన్యాసం ముగించారు.

నెల్లూరులోని మదర్ థెరిస్సా హోమ్, కస్తూరిదేవి హైస్కూల్‌లకు ఐదేసి వేల లెక్కన గోపాలరెడ్డి విరాళం ప్రకటించారు. తనను అభిమానించే కవులు, కళాకారులను పట్టు వస్త్రాలతో సత్కరించారు. తాను రచించిన పుస్తకాల సెట్టును వర్ధమాన సమాజం లైబ్రరీకి కానుకగా ఇచ్చారు. సభానంతరం వెంపటి చినసత్యం కుమారుడు రవిశంకర్ నేతృత్వంలో కూచిపూడి నృత్య ప్రదర్శనలోని స్వాగత గీతం, రుక్మిణీ ప్రకాశ తరంగం, దశావతారాలు ప్రేక్షకులను రసరమ్య తీరాలకు చేర్చాయి. ఏనాడూ 8.30 తర్వాత సభలలో పాల్గొనని గోపాలరెడ్డిగారు రాత్రి 11.30 గంటల వరకు సభానంతరం జరిగిన విందులో కూడా ఉత్సాహంగా పాల్గొని అతిథులకు కొసరి మరీ వడ్డించారు.

## మూడుకోట్లు

1వ పేజీ తరువాయి

లారీల కొద్దీ సిమెంట్ తరలి వెళ్లిందని విజిలెన్స్ దర్యాప్తులో తేలినా - ఆ ఫైలు వెలుగు చూడకుండా తొక్కి పెట్టేశారట.

ఈ విషయంపై ముఖ్య మంత్రి స్థాయిలో విచారణ జరిగితే తప్ప ఈ దోపిడీ నివారింప బడదు. చంద్రబాబు నాయుడు గారు సంబంధిత ఫైళ్లు తెప్పించుకొని దర్యాప్తుకు ఆదేశించడం, అక్రమంగా జరుగుతున్న సిమెంటు తక్షణం నిలిపి వేయడం అవసరం.

## సణుగుడు

4వ పేజీ తరువాయి

కాంగ్రెస్ ప్రతి పక్షంలో వుండిపుడు; ఒక్క యానాదిరెడ్డి, మినహా మరొక ఎమ్మెల్యే గెలవలేరు. పార్టీని బ్రతికించు కోవడానికి ప్రతి ఒక్కరూ ఇల్లు వళ్లు మరచి పోరాడవలసిన సమయమిది. ఇటువంటప్పుడు ఇటువంటి వ్యక్తులు పార్టీ పగ్గాలు చేతపట్టు కుంటే అది కల్యా పారధ్యమౌతుంది తప్ప, పోరుకు సన్నద్ధమయ్యే వీలు దొరుకు తుందా? తెలుగు దేశంతో చెలిమి కట్టి, తెలుగు ఎమ్మెల్యేల అడుగులకు మడుగులొత్తే పెద్ద మనుషులా కాంగ్రెస్ పెద్దరికం వహించ వలసింది?

## జనరల్ నోటీసు

మా కక్షిదారుడైన కొండా సాంబమూర్తి, S/O వెంకట సుబ్బయ్య, నెల్లూరు రెంటు కంట్రోలరు కోర్టులో వేళపాళెం గోపాల రెడ్డి, S/O సుందర రామిరెడ్డి మీద RCA.32/84గున షెడ్యూలు దాఖలా ఆస్తిని ఖాళీ చేయుమని వేసినారు. సదరు కేసులో పై కోర్టువారు ఖాళీచేసి స్వాధీనము చేయుమని తీర్పు యిచ్చి యున్నారు. సదరు తీర్పు మీద వేళపాళెం గోపాలరెడ్డి CMA 10/92గున నెల్లూరు సబ్ కోర్టులో అప్పీలు దాఖలు చేసి వున్నారు. యీ కేసు విచారణకు కూడా వచ్చి యున్నది. సదరు గోపాలరెడ్డికి సదరు షెడ్యూలు దాఖలా ఆస్తిని Sub-Leaseకు గాని అన్యాక్రాంతము చేయుటకు గాని ఏలాంటి హక్కున్నూ లేదు. ఎవరైనను సబ్ లీజుకు తీసుకున్న యెడల కోర్టులో యిచ్చు తీర్పుకు బాధ్యులు కాగలరు. అలాంటి హక్కులు మరెవ్వరికీ లేవు.

### షెడ్యూలు

Nellore Registration District, Nellore Sub-Registration, Dargamitta of Nellore Town. Ward No.24, Door No. 383/G and Assessment No. 21682 -- 225 Ankanams of vacant site and 4 Ankanams of Thatched House -- there in and compound wall bounded by: EAST: Yanadi Sangam; SOUTH: Road; WEST: Site of Somisetty Kondaiah; NORTH: Site belonging to Beldari Ramaswamy.

**T. SREEHARI**
Advocate

లాఠీచార్జి చిత్రంలో రోజా

## విజయనిర్మల విరక్తి

# కస్తూరి వద్దు బాబో!

అంటిపేరు కస్తూరి వారు; ఇంట్లో గబ్బిలాల వాసన అన్నట్లు — తమిళ నటి కస్తూరి అప్పుడప్పుడు తన నిజ స్వరూపం చూపించి, కొందరు తమిళ నిర్మాతలను హడలగొడు తుంటుంది. దాంతో తమిళ సినిమాలు తగ్గేసరికి తెలుగు సినిమా రంగం పట్ల దృష్టి సారించింది. విజయ నిర్మల దర్శకత్వం వహించే "రెండు కుటుంబాల కథ" చిత్రం షూటింగ్‌లో రెండో రోజు నుంచే తన తడాఖా చూపించడం మొదలెట్టిందని విజయ నిర్మల వాపోతున్నారు. నేను ఏడవ ఏట సినిమా రంగంలో ప్రవేశించాను. అప్పటి నుండి ఈ 35 ఏళ్లలో నాకు ఇలా విసుగు, విరక్తి, అసహ్యం ఎవరూ కల్గించ లేదు, అంటూ విజయ నిర్మల ఎంతో బాధపడింది. తమకేవో లోట్లు జరిగాయని కస్తూరితో పాటు ఆమె తల్లి కూడా ప్రొడక్షన్ వాళ్ల ఎదుట మొరపెట్టుకోవలసిన గోడును పరాపరి విజయ నిర్మల ఎదుటే వెళ్లగక్కారట. చివరి సెట్యూల్‌కు బాలెన్స్ పాతిక వేలు చెల్లిస్తే గాని, రాజమండ్రికి బ్రెయిన్ ఎక్కనన్నారట. కస్తూరి గదిలో మినరల్ వాటర్ కేసులు కొద్దీ సరఫరా చేయాలట. ఆమె మేకప్ ముందు, తర్వాత మినరల్ వాటర్‌తోనే ముఖం కడుక్కుంటుందట! కస్తూరి తల్లి తనతో పాటు ఒక వీడియో కెమెరా కూడా తీసుకొచ్చి కస్తూరి పాల్గొన్న సీన్లన్నీ టేప్ చేసుకుందట. ఈ దారుణం చాలక వాళ్లు మద్రాసుకు చేసే ఎస్‌టిడి కాల్సులకు నిర్మాతే డబ్బు చెల్లించాలని పట్టుబట్టారట. ఇటువంటి విపరీత ప్రవర్తనకు విసిగి పోయిన విజయ నిర్మల, ఇప్పటి తారలెట్లా తయారౌతున్నారో చూడండి అని వాపోయారు.

# డాక్టర్ రాజశేఖర్ కొత్త డార్లింగ్

"రథయాత్ర" చిత్రం ప్రారంభోత్సవానికి వచ్చిన డాక్టర్ రాజశేఖర్ "ఎక్కడ నా డార్లింగ్ శివాని ... ఇంకా రాలేదా?" అని తన మేకప్‌మాన్‌ని అడుగుతుంటే అక్కడున్న వారందరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అది గ్రహించి రాజశేఖర్ "శివాని ఎవరను కున్నారు మా అమ్మాయి. ఇంకా ఒక నెల నిండ లేదు. ఇంత వరకు అమ్మాయిని బయటకు తీసుకు రాలేదు. ఈ ఫంక్షన్‌కు జీవిత తీసుకొస్తానంది... అదిగో వచ్చేసింది," అంటూండగానే పాపతో కారు దిగి రాసాగింది జీవిత. శివాని అంటే ఏమిటి? ఒక సినిమా వారపత్రిక విలేకరి అడిగారు. అది కూడా తెలియదా? పార్వతికి ఇంకో పేరు, అంది జీవిత. పాపాయిని ముద్దాడుతూ, మాకు ముందు పాపే పుట్టాలని కోరుకున్నాం, బాబు సంగతి తర్వాత చూసుకోవచ్చు. అన్నారు రాజశేఖర్ నవ్వుతూ.

# ముద్దొస్తున్న ముసలి కమలహాసన్

ఒకప్పుడు సిగరెట్లు తెగ ఊది పడేసేవాడ్ని. అది మానాలని బీడీలు తాగడం మొదలెట్టాను. ముక్కు పొడి అలవాటు చేసుకొని బీడీలు మానేశాను. నశ్యం కాస్త న్యూసెన్స్‌గా ఉండేది. మెల్లగా దాని పీడ వదిలించుకొని ఇప్పుడు వక్కపొడి నములడంలో మునిగి పోయాను. ఇది మానడానికి ఇంకేం కొత్తది అలవాటు చేసుకోవాలో తెలియడం లేదు. కొందరు మనుషులు ఇలాంటి పాడు అలవాట్లు ఏవీ లేకుండా ఎలా ఉండ గలుగు తున్నారో ఆశ్చర్యం వేస్తుంది. కమల హాసన్‌ను తీసుకోండి. ఏ అలవాటూ లేదు, అతనిలా యాక్ట్ చేయడమూ ఎవరి తరమూ కాదు. 'ఇండియన్' సినిమాలో వృద్ధ పాత్రలో ఎంత ముద్దొస్తున్నాడు! అన్నారు మమ్ముట్టి. ఈయన ఒక హిందీ చిత్రంలో అంబేద్కర్‌గా బుక్ అయ్యారు. ఆ పాత్రకు ప్రాణ ప్రతిష్ఠ చెయ్యడానికి ఆయనపై వ్రాసిన గ్రంథాలు చదువు తున్నారు.

### మమ్ముట్టి అభినందన

## చిరంజీవి "హిట్లర్" ప్రారంభం

చిరంజీవి, దాసరి నారాయణరావు, రాజేంద్ర ప్రసాద్,సుధాకర్, బ్రహ్మానందం, బాబూమోహన్, రామిరెడ్డి, ఉత్తేజ్, ప్రకాశ్‌రాజ్, రాధాకృష్ణమూర్తి, రంభ, మోహిని. సంగీతం: వై.విజయ, అశ్విని, రాధాబాయి, పద్మశ్రీ, గాయత్రి, రాధాకుమారి పాత్రధారులు. మాటలు: ఎల్.బి.శ్రీరామ్, పాటలు: వేటూరి, సిరివెన్నెల, సంగీతం: కోటి, దర్శకత్వం: ముత్యాల సుబ్బయ్య.

# తమిళంలో వెంకటేష్

వెంకటేష్ తొలిసారిగా నటించే తమిళ చిత్రాన్ని కె.ఆర్.జి నిర్మిస్తారు. ఇందులో విజయశాంతి నాయిక, "పెదరాయుడు, ముత్తు" చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం నెరపిన కె.ఎస్. రవికుమార్ డైరెక్టరు.

## "శుభాకాంక్షలు"

తమిళంలో 200 రోజులకు పైగా ప్రదర్శింప బడుతున్న "పూవే ఉనక్కాగ" చిత్రాన్ని "శుభాకాంక్షలు"గా తెలుగులో నిర్మిస్తున్నారు. జగపతిబాబు, రవళి నాయకా నాయికలు. దర్శకత్వం: భీమినేని శ్రీనివాసరావు.

## మణిరత్నం "ఆనందం"

రోజా, బొంబాయి చిత్రాలతో రోజాన్ని ఒక ఊపు ఊపిన డైరెక్టర్ మణిరత్నం తాజాగా రూపొందించే "ఆనందం" చిత్రాన్ని తెలుగులో విడుదల చేసే హక్కులను జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేతలు మురళీ మోహన్, కిశోర్ పొందారు. ఒక కుగ్రామంలో నివసించే యువకుడు నాటకాలలో నటుడుగా పేరు పొంది, అటుపైన సినిమా రంగంలో ప్రవేశించి, పేరు ప్రఖ్యాతులు ఆర్జించి, అనంతరం రాజకీయ నాయకుడై ప్రజల అభ్యున్నతికి పాటు పడతాడు. ఈ పాత్రలో మలయాళ నటుడు మోహన్‌లాల్, 'విశ్వ సుందరి' ఐశ్వర్యా రాయ్, టాబూ, మధుబాల, రేవతి, గౌతమి, ప్రకాశ్ రాజ్ నటిస్తున్నారు. ఈ చిత్రం దీపావళికి విడుదలవుతుంది. ఇది తెలుగు, తమిళం, హిందీ భాషల్లో కూడా ఒకేసారి తయారవు తుంది.

## తిలకవతి సి.బి.ఐ.

తమిళనాడు పోలీస్ ఆఫీసర్ తిలకవతి పేరును మా చిత్రానికి పెట్టడానికి ఆమె అనుమతి తీసుకున్నాం. నాయిక పాత్రలో విజయశాంతి ఈ చిత్రంలో తానేమిటో నిరూపించు కున్నది.

## వినోదాల హరివిల్లు, సంతోషాల విరిజల్లు

# వినోదం

తెలుగు ప్రేక్షకుడికి హాయిని, ఆనందాన్ని కల్గించి, హాస్యంలో ముంచి చక్కని ఆరోగ్యకరమైన వినోదాన్ని అందించి పేరు సార్థకం చేసుకున్న చక్కని చిత్రం యస్వీ కృష్ణారెడ్డి "వినోదం". సినిమా పేరుకు, కథాంశానికి సంబంధ బాంధవ్యాలకై గజిబిజిగా ఆలోచించి సరిపోయిందనిపించే రోజుల్లో, కథకు తగ్గపేరుతో సినిమాలు వెలువరించడం కృష్ణారెడ్డి ప్రత్యేకత!

ఈ చిత్రం అనూహ్య, అసాధారణ మలుపులు తిరగడంతో, ప్రతి మలుపును పండించడం చేయి తిరిగిన కృష్ణారెడ్డి వంటి దర్శకులకే చెల్లుతుంది. ప్రతి మలుపు ఓ మెరుపై ప్రేక్షకుడిపై వినోదాల జల్లు కురిపిస్తుంది. హాస్య మకరందాన్ని 'వినోదం' పేర ప్రేక్షక జనావళికి అందించిన యశస్వి శ్రీయస్వీ అభినందనీయుడు.

హాస్యం పేర విచ్చలవిడితనాన్ని, వెకిలి చేష్టల వింత కథనాల్ని మోసుకొస్తున్న ఈ రోజుల్లో నూటికి నూరుపాళ్లు ఆహ్లాదకరమైన వినోదాన్ని అందించిన ఈ సినిమా వినోదాల హరివిల్లు, సంతోషాల విరిజల్లుగా చెప్పవచ్చు. యస్వీ కృష్ణారెడ్డి పనితనానికి ఇది పెద్ద లెక్కలోనిది కాకపోవచ్చు కాని, కల్తీలేని కాలక్షేపాన్ని అందించిన ఆయన కృషిని ప్రశంసించకుండా ఉండలేం!

రాజా, అలను ప్రేమించడం. డబ్బున్న బంగారం వారి ప్రేమను తిరస్కరించడం. వివిధరకాల ప్రయత్నాల్తో రాజా ఆమెను పెళ్ళి చేసుకోవాలను కోవడం. చివరికి పట్టువదలని వారి ప్రయత్నాలకు తలవంచి, బంగారం ఆ పెళ్ళికి వచ్చుజెండా ఊపడమే స్థూలంగా ఈ సినిమా కథాంశం!

కథలో వైవిధ్యం పెద్దగాలేక పోయినా, కథనంలోని వినూత్నత

**చిత్రపరామర్శ**

✳

**సి. నారాయణరావు**

మనల్ని ఆట్టే ఆకట్టు కుంటుంది. సన్నివేశాలు తర్కానికి నిలువలేక పోవచ్చుకాని, "అలాజరిగితే" ఎలా ఉంటుందో చూపించిన తీరు, శక్తివంతమైన ఆ చిత్రీకరణ ప్రేక్షకుణ్ణి ఆనంద పరవశుణ్ణి చేస్తాయి.

బంగారం పాత్ర ఉన్నట్టుండి సింగారంగా మారిపోవడం, సింగారానికి గతం గుర్తొచ్చినప్పుడల్లా తికొట్టి ఆయన మనసు మార్చడం [illegible] పనితనానికి చక్కని నిదర్శనం.

ఒక దొంగ పాత్రను దొంగగా నడపడం మరో ప్రత్యేకత. నిజంగా ఇంత హుందాగా దొంగతనం చెయ్యొచ్చా అన్పించే రీతిలో బ్రహ్మానందం అద్భుత నటన ఆ పాత్రకు ప్రాణం పోసింది.

ఉత్తుత్తి బ్యాంకు, దొంగ పోలీస్ స్టేషను సెట్లు వేయడం వంటి ప్యూహాల్ని క్షణాలమీద అమలు పరచడం విభ్రాంతికి గురిచేస్తుంది!

అమెరికా అబ్బాయికి వనమ్మాయిని అప్పజెప్పడం, అక్కడి వకర్వుంది చిత్రీకరణ పతాక సన్నివేశానికి ఎంతో బలాన్నిచ్చింది. చివరకు కూడా నిజం తెలియకుండా బంగారం కూతుర్ని పెళ్ళి చేసుకొన్నాననే భ్రమలో అమెరికా పెళ్ళి కొడుకు అలాగే వెళ్ళిపోవడం, రాజా, అలను పెళ్ళి చేసుకోవడం సరిక్రొత్త పోకడ! ఈ ముగింపే సినిమాకు ఆయువు పట్టయింది. ఇక్కడే దర్శకుని చాణక్యం తేట తెల్ల మవుతుంది.

ప్రథమార్థంలో విసుగు పుట్టించిన కథనాన్ని ద్వితీయార్థంలో పరుగులు తీయించారు దర్శకుడు. ఆఖరున బంగారం పరివర్తన చెందడాన్ని మాటల పరంగా కాక, భావయుక్తంగా నడిపి ఉంటే ఆసన్నివేశం మరింత రాణించి ఉండేది!

కోట [illegible] పాత్రకు నూరుపాళ్ళు

కొరవ 12 పేజీలో

# రాయి – తురాయి

* వైభవంగా జరిగిన సత్కార పురస్కారం
* నాగార్జున సాగర్‌లో గోపాలరెడ్డి ప్రమేయం లేదు
* పప్పు వారు పోలికల పోగుపెట్టాలి!

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు నోనాజనేరియన్ (Nonagenarian) అయ్యారు. 90 నుంచి 100 సంవత్సరాల మధ్య వయస్సు ఉంటే వాళ్లను ఇంగ్లీషు వాళ్లు ఆపేరుతో వ్యవహరిస్తుంటారు. దీనికి సమానార్థకమైన మాట తెలుగులో లేదు; కాబట్టి ఆంగ్ల శబ్దాన్ని ఆశ్రయించవలసి వచ్చింది. నిజానికి వయోభారం దేహానికే; దేహాన్ని ఆశ్రయించి నిరూపంగా ఉండే మనస్సుకు ముదిమిలేదు. గోపాలరెడ్డిగారి మనసు నవనవోన్మేషం; ఆయన హృదయం ఉత్తమ సంస్కార సంభరితం.

ఆజానుబాహుఫు; అందగాడు, అవినీతి "అంటు" అంటనివాడు. ఆస్తిపరుడు – అశేష హితైషుల ఆదరాభిమానాలు కూడా ఆయన ఆస్తిలో కలిసిపోయ్యే ఐశ్వర్యులే. ఇన్ని మంచి

## అగ్నిమిత్ర

లక్షణాలు ఆయనలో మూర్తీభవించాయి. అందుకనే ఆయనకు నెల్లూరులో జరిగిన సత్కార పురస్కారం అంత వైభవంగా జరిగింది.

అసంఖ్యాకంగా వ్యక్తులూ, పుంఖాను పుంఖంగా సంస్థలు ఒకరితో మరొకరు పోటీ పడ్డట్లు ఈ సత్కార్యంలో పాల్గొనడం విశేషం. వాసిమించిన పూలగుత్తులు రాసిపడ్డాయి. పూమాలలు పూలేరుల్లా ఆయన కంఠసీమను కావలించుకొని, ఊరి ప్రదేశంలో విశ్రమిస్తున్నప్పుడు గోపాలరెడ్డిగారు పుష్ప ధన్విలా పొడగట్టారంటే నమ్మండి. ఆ దృశ్యం కన్నోయికి కమ్మని విందు!

* * *

నాగార్జున సాగర్ పురుడు పోసుకోక ముందు – అది నందికొండ; అప్పట్లో – కృష్ణా పెన్నార్ ప్రాజెక్టా – నందికొండ ప్రాజెక్టా అనే వివాదం తలసూపింది. కాంగ్రెసు వాళ్లు కృష్ణా పెన్నార్‌ను నెత్తికెత్తు కొన్నారు. కమ్యూనిస్టులు నందికొండను మూపున వేసుకొని మోశారు. స్వర్గీయ తరిమెల నాగిరెడ్డిగారి నేతృత్వంలో కమ్యూనిస్టులు వాడవాడలా సభలు తీర్చారు; ఉద్యమ స్ఫూర్తితో ఆందోళన లేవనెత్తారు. ప్రజాభిప్రాయాన్ని నందికొండకు అనుకూలంగా కూడగట్టారు.

ఇంతలో రాష్ట్రపతి పాలన రానేవచ్చింది; సి.యం. త్రివేది రాష్ట్ర గవర్నరుగా వచ్చారు. వారుల ద్వారా ఆయన ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొన్నారు. నందికొండ ప్రాజెక్టుకు అనుమతి ఇవ్వ వలసిందిగా కేంద్రానికి సిఫారసు చేశారు.

ఈ విలువైన నిజానికి మరొక ప్రమాణం కూడా ఇస్తున్నాను. "రోజులు మారాయి" సినిమాకు "ఏరువాక సాగారో రన్నోచిన్నన్నా–" అనే పాటను రాసిన కొసరాజు రాఘవయ్య చౌదరి గారే – అదే బాణీలో "గవర్నర్ త్రివేది కలం పోటుతో – నందికొండ వచ్చెనురో రన్నా రైతన్నా–" అనే పాటను కూడా రాశారు. అది అనాటి ప్రభుత్వ మాసపత్రిక "ఆంధ్ర ప్రదేశ్"లో అచ్చయింది కూడ.

ఇది నాగార్జున సాగర్ చరిత్ర. నందికొండకై పోరు సల్పింది కమ్యూనిస్టులు; నాగార్జున సాగర్‌గా పేరు మార్చింది కాంగ్రెసు వాళ్లు. సాంకేతిక రూపశిల్పి స్వర్గీయ కె.యల్. రావుగారు. గోపాలరెడ్డి గారి ప్రమేయం ఇందులో ఇసుమంతైనా లేదు.

చారిత్రక విషయ సమర్పణలో సత్యనిష్ఠ తప్పనిసరి. వక్రభాష్యం వల్ల వెలితి పడటం తప్ప అదనంగా ఒనగూరే ఘనత సున్న. బె.వి. రెడ్డిగారివిషయ సమర్పణ సత్యానికి చాలా దూరం.

సభానంతరం నా పక్కనే ఉన్న ఒక పెద్దమనిషి "పప్పు వేణుగోపాలరావు గారు సోదాహరణంగా ప్రసంగించి ఉంటే బాగుండేది" అన్నాడు. "ఏ విషయంగా అని నా ప్రశ్న. తిక్కన – గోపాలరెడ్డి గార్లను గూర్చి చెప్పిన సాపత్యం విషయంలో అన్నా రాయన;" సమయం మించి పోయింది కదా!" అని నేనంటే "ఒకటి రెండు ఉదాహరణల కేనా ?" అంటూ వెళ్లారాయన.

నిజమే; పప్పు వేణుగోపాలరావు గారు అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్‌కు అధినేత; ఆయన సాధికారంగానే ఆమాట అని ఉంటాడని నానమ్మకం. తిక్కన కవిత్వంలోని శివిని, గోపాలరెడ్డిగారి కైతల పటిమను తులనాత్మకంగా పరిశీలించి ఉంటాడనటంలో ఏమాత్రం సందేహం ఉంచ నవసరం లేదు. నుడికారపు సొంపులోనే, ఒడికారపు హొయలులోనే ఇరువురిలో ఏవో కొన్ని పోలికలు పసిగట్టి ఉండవచ్చు ; సభలో వాటి ప్రస్తావనకు సమయం చాలకపోయి ఉండవచ్చు.

మించిపోయింది లేదు ; వేణుగోపాలరావుగారు ఇద్దరి కవిత్వాలలో తాను గమనించిన పోలికలన్నింటినీ పోగుపెట్టి, దారంలో మణిపూసల్లా కుట్టి, ఒక చిరు పొత్తం రూపంలో ప్రకటిస్తే – ఎనలేని ఆ కృషి తెలుగు సాహిత్యానికి పుష్టినిస్తుంది; పప్పు వారు వెంటనే ఆ పనికి పూనుకోగలరని ఆశిద్దాం!

ఆనం వివేకానందరెడ్డిగారు ఒకమాట చెప్పారు. గోపాలరెడ్డిగారు తనకు ఒక్క కోరిక తప్ప ఇంకే కోరికలూ లేవన్నారట. తనకు వచ్చేయేడు భారత దేశంలో జరుగనున్న భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలను తిలకించి పులకించి పోవాలని ఉందనీ. అందువల్ల భగవంతుడు తనకు ఇంకొక్క సంవత్సరం ఆయుష్షు పొడిగిస్తే చాలునని కోరుకున్నారట.

ఈ కోరికలో కూడ ఆయన స్వార్థం చూపించడం లేదు. స్వాతంత్ర్య సమరయోధుడుగా స్వర్ణోత్సవాలను చూడాలనే తపన ఆ కోరికలో ఉంది. ఒక్క సంవత్సరం కాదు; గోపాలరెడ్డిగారు నిండు నూరేళ్లు జీవించాలనీ, అలసటలేని సాహిత్య సేద్యంలో ఆయన తరించాలనీ మనం కూడా భగవంతుణ్ణి వేడుకొందాం.

# కమర్షియల్ జిమ్మిక్కులతో నీరసపడిన 'కాలాపానీ'!

పేరు గొప్ప ఊరు దిబ్బ సామెతను గుర్తుకు తెస్తూ, కోట్లాది రూపాయల ఖర్చు, భారీ తారాగణం, విపరీతమైన ప్రచారం నడుమ నాలుగు భాషల్లో తీసిన 'కాలాపానీ' చిత్రం ప్రేక్షకులను ఆకట్టు కోలేక పోయింది. దీనికి దర్శకుడు ప్రియదర్శన్ పూర్తి బాధ్యత వహించాలి. కథ, స్క్రీన్‌ప్లే, సమర్పణ వంటి అదనపు బాధ్యతలన్నీ స్వీకరించి వాటికి న్యాయం చేయలేక పోయారాయన. స్వాతంత్రోద్యమ ఘట్టంలో అండమాన్ సెల్యూలర్ జైలులో దేశభక్తులు పడిన పాట్లను కళ్లకు కట్టినట్లు చూపడం ఈ చిత్ర ప్రధాన ధ్యేయం. వీటిని సంకేతప్రాయంగా చూపి వుంటే ప్రేక్షకుల హృదయం చూరగొని వుండేవి. కాని 20రీళ్లు సాగదీసి ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించారు. జైలులో బ్రిటిష్ అధికారుల పాశవిక కాండను సతి రీలులో చూపించారు. అయినా ప్రేక్షకుల వళ్లు ఒక్కచోటా జలదరించదు. ఆవేశంలో బ్రిటిష్ పాలకులను అనవసరంగా శాపనార్థాలు పెట్టారు. స్వదేశీ ఉద్యమంలో చురుకుగా పాల్గొనే హీరో చేత విదేశీ వస్త్రాలు, బూట్లు ధరింప చేయడంతో ఆ పాత్ర ఔన్నత్యం దెబ్బ తినింది. అదే విధంగా 80ఏళ్ల క్రితం నాటి సినిమాలో ఈనాటి రైలును వెనుక నుంచి చూపించడం వల్ల చిత్రంలోని చారిత్రక ప్రాధాన్యత పట్ల దర్శకునికి వున్న నిబద్ధతను ప్రశ్నించవలసి వస్తుంది. జైలులో ఖైదీలపై పాశవిక కాండ జరిపి, వారి శవాలను మంటల్లో పడేసే సమయంలో శవాలకు బదులు రబ్బరు బొమ్మలు కన్పిస్తాయి. ఉదాత్త భావనతో సాగే కథనంలో కమర్షియల్ జిమ్మిక్కుల కోసం హీరోయిన్ చేత చేయించిన అంగాంగ ప్రదర్శన సబబు కాదు.

అండమాన్ జైలులో భారతీయ దేశభక్తులైన ఖైదీల చేత అకృత్యాన్ని తినిపించడం, నాలుకతో బూట్లను నాకించడం, నిజం చెబితే నాలుక

## చిత్ర సమీక్ష

☆

**అల్లూరు రహీం**

చీల్చేయడం, గోడను బాదినట్లు చావబాదడం, బహిరంగ స్నానాలు చేయించడం, కిరాతకంగా కాల్చేయడం వంటి సన్నివేశాలు సాదా సీదాగా చూపబడ్డాయి. జైలులో అలనాటి వాతావరణం, ఉపయోగించిన వస్తువులు సేకరించి చూపించడంలో దర్శకుడు కృతకృత్యుడయ్యారు. బ్రిటిష్ పాలకుల వల్లే 600జాతుల భారతం ఒకటయ్యిందని ఒక బ్రిటిష్ డాక్టర్ వ్యాఖ్యానిస్తే, మానవత్వపు విలువలు పరిమళించే భారత భూమిని అండమాన్ జైలులో పనిచేసే మరో డాక్టర్ విపరీతంగా అభిమానిస్తాడు.

అలనాటి పరిస్థితులు కళ్లకు కట్టేలా సెట్టింగులు వేయడంలో కళాదర్శకుడు సాబూశిరిల్ పడిన కష్టం ఫలించింది. సన్నివేశాల చిత్రీకరణతో పాటు దీవుల్లోని చెట్ల మాటున సూర్యోదయ, అస్తమయ దృశ్యాలు, ఆకాశంలో మేఘాలు కమ్ముకోవడం, గాలివాన రావడాన్ని తన కెమెరాలో సంతోష్ శివన్ అద్భుతంగా చూపి చిత్రానికి ప్రాణప్రతిష్ఠ చేశారు. రాజశ్రీ చనిపోయాక డబ్బింగ్ చిత్రాల మాటలు వినసొంపుగా ఉండడం లేదు. కాలాపానీకి మాటల తోపాటు పాటలు వ్రాసిన శ్రీరామకృష్ణ వాటిని అయోమయ పడి వ్రాసినట్లుంది. పద్దెనిమిది కోట్లు ఖర్చు పెట్టిన సినిమాకు ఆస్థాయిలో సంగీతం ఇళయరాజా ఇవ్వలేక పోయారు.

గ్రామీణ ప్రాంతంలో డాక్టర్‌గా పనిచేస్తుండే గోవర్ధన్ (మోహన్‌లాల్) స్వాతంత్ర ఉద్యమంలో పాల్గొంటుంటాడు. అహింసాయుత పద్ధతులు పాటించే ఆయన కొందరు అతివాదుల చర్య మూలంగా రైలు పేల్చివేత కేసులో యావజ్జీవ శిక్షపడి అండమాన్ జైలుకు తరలింప బడతాడు. జైలులో వీరసావర్కర్ (అనూకపూర్), ముకుందం (ప్రభు), రామలఖన్ (టినూ ఆనంద్) స్వరాజ్య ఎడిటర్ (ఢిల్లీ గణేష్) జారస పడతారు. వీరందరి ధ్యేయం ఒక్కటే, భారతమాతను దాస్య శృంఖలాల నుంచి విముక్తి చేయడం. దేశ భక్తులను జైలులోనే అంతం చేయడానికి జైలర్ స్ప్రెక్ (జాన్ కొయిటన్ బార్), మిర్జాఖాన్ (అమ్రీష్‌పూరి) పాశవిక పద్ధతులు అమలు చేస్తుంటారు. శాకాహారైన రామలఖన్ చేత మాంసాహారం తినిపించబోయి, అందుకతడు నిరాకరించడంతో అకృత్యం సాగిస్తారు. ఇది భరించలేక మృత్యువును కౌగిలించుకొంటాడా దేశ భక్తుడు. ఈ విషయంపై వీరసావర్కర్ నాయకత్వంలో ఖైదీలు నిరాహార దీక్ష చేస్తారు. మార్కిస్టు అయిన ముకుందం 12సార్లు జైలు నుండి తప్పించుకోను ప్రయత్నించి పట్టుబడి పోతాడు. జైలులో భారతీయ ఖైదీలపై పాశవిక కాండను వ్యతిరేకించి డాక్టర్ హటన్ అనే విదేశీయుడు వైస్రాయ్‌కు ఫిర్యాదు చేస్తాడు. విచారణ కమీషన్ ముందు జైలర్, మిర్జాఖాన్ అకృత్యాలు బయట పడేసరికి వీరిద్దరు తెలివిగా జైలులో మత ఘర్షణలు సృష్టిస్తారు. డాక్టర్ హటన్ సహాయం మూలంగా విడుదలకు సిద్ధంగా వున్న 16మంది ఖైదీలలో 14మందిని, ముకుందాన్ని పరమ కిరాతకంగా చంపేస్తారు. ఇది భరించలేని అహింసావాదైన గోవర్ధన్, హింసావాదిగా మారి జైలర్‌ను, మిర్జాఖాన్‌ను అంతమొందించడంతో చిత్రం ముగుస్తుంది.

పాత్ర పోషణలో రాణించిన అమ్రీష్‌పూరి, టినూ ఆనంద్, అనూకపూర్‌ల ముందు హీరోల నటన వెలవెల పోయింది. టాబూ వంటి వయ్యారంతో పాటు అక్కడక్కడ 'కంటి' నటన కూడా చూపింది. ఆర్ట్ ఫిలిమ్‌ను కమర్షియల్ పంథాలో తీయబోయి చతికిల బడ్డ చిత్రమే కాలాపానీ.

## ఏభైఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

దేవాలయ కోరినను, హరిజన ప్రవేశమునకు అనుమతించుటకు ఇంత కాలం పట్టింది. దీనికి కారణం మంత్రి కోటిరెడ్డిగారి మాంద్యమే అయితే పర్వాలేదు. ఈ ప్రవేశానికి మరల పొట్టి శ్రీరాములుగారు ఉపవాస దీక్షకు కడంగవలెనా?

### జమీందారి విచారణకు కమిటి

ఆంధ్ర రాష్ట్ర జమీందారి విచారణ కమిటీని శ్రీ నెల్లూరు వెంకట్రామా నాయుడు గారధ్యక్షులుగా, రావిపాటి మహానంద, చెబ్రాప్రగడ చంద్రేశ్వర శర్మ, గొతు లచ్చన్న, నాగినేని వెంకయ్య, పి.తిమ్మారెడ్డి గార్లతో ఒక సబ్ కమిటీని నియమించింది. ఈ కమిటీలో రాష్ట్ర రైతు కాంగ్రెస్ అధ్యక్ష కార్యదర్శులు గూడ సభ్యులుగా ఉంటారు.

### బుడతకీచు పోర్చుగీసు గోవా

పిచ్చుక పై బ్రహ్మాస్త్రం ఎందుకు అంటారు గాంధీజీ. బుడతకీచు పోర్చుగీసు గోవా ఎంత? రేపేవేళకు అది వచ్చినట్లు స్వతంత్ర భారతంలో కలియదూ? అని మహాత్ము డన్నారు. పోర్చుగల్ గోవా పాలకుల అభిప్రాయం భిన్నంగా ఉన్నది. యుద్ధనావను తెప్పించారు. సత్యాగ్రహులారా, కబడ్దార్ అంటున్నారు. ప్రజానాయకుడగు కున్హా గారికి యెనిమిది ఏండ్లు ఖైదు శిక్షవేశారు. (గోవా పరాయి పేరు; గోమంతకం అసలు పేరు.)

### మున్సిపాలిటీల ముఖ్య కర్తవ్యం

సోవియట్ రష్యాలో యుద్ధానంతరం నాటక కళ నవ్యకాంతులతో నృత్యం చేయబోతూంది. క్రొత్తగా నిర్మించబోయే 300 నాటక శాలాశాలలతో కలిపి 1950కి రష్యాలో మొత్తం 898 నాటక కళాశాలలుండ గలవు.

స్థానిక స్వయం పరిపాలన అనుభవిస్తున్న మనం ఈ విషయమై కొంత కృషి చేసే అవకాశాలు ఉన్నవి.

మునిసిపాలిటీలు నాటక శాలలను నిర్మించుటకు మునిసిపల్ చట్టం కూడ అవకాశం ఉంది. 'ఎ' క్లాసు మునిసిపాలిటీకి పాలనా వినోదపు పన్ను వల్ల సాలీనా 25000 ఆదాయం ఉంటుంది. 'బి'క్లాసు ఐతే 15000 లన్నా ఉంటుంది. అందులో సగం మునిసిపాలిటీ తన వాటాగా పొంది, దాన్ని కేటాయించి ఉంచితే 2 సంవత్సరములలోగా ప్రతి మునిసిపాలిటీ ఒక్కొక్క థియేటరును నిర్మించవచ్చు. వినోదపు పన్ను వల్ల కలిగే ఆదాయమంతా నిజంగా నాటకశాల నిర్మాణానికి, ప్రజల విజ్ఞానాభివృద్ధికి, వినోదాలకు వెచ్చించడమే సమంజసంగా ఉంటుంది. – ఆచార్య ఆత్రేయ

# రాజకీయ బురదగుంటలో ఆయనొక తామర పువ్వు!

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారి90వ జన్మదినోత్సవ వేడుకలు రంగరంగ వైభవంగా 10వతేది టౌన్‌హాల్‌లో జరిగాయి. 90ఏళ్ల పెళ్లి కొడుకుకి స్వాగతం పలుకుతూ టౌన్‌హాల్ పెళ్లి కూతురులా ముస్తాబయ్యింది. పూర్ణ కుంభ స్వాగతాలు, వేద మంత్రాలు, మంగళ వాయిద్యాలు, గులాబి, అగరు వత్తుల పరిమళాలు, పూమాలలు చేబట్టి తరలివచ్చిన అభిమానులతో ఆహ్లాదకర వాతావరణం నెల కొన్నదక్కడ. ఏర్పాటు చేసిన ప్రత్యేక సింహాసనంపై ఆయన కూర్చోగానే చూడ ముచ్చటైన 'కళ' వచ్చి పడింది. దూరా భారం లెక్క చేయక సుదూరం నుంచి ఖచ్చితమైన సమయానికి రమణయ్య రాజా, ఐ.ఎస్.రెడ్డి, మాలతీ చందూర్ వంటి బె.గో.రె అభిమానులు తరలివచ్చారు. జిల్లాలోని అతి ముఖ్య వ్యక్తులతో పాటు పెద్ద సంఖ్యలో మహిళలు కవులు, రచయితలు గోపాలరెడ్డిగారిని అభిమానించే అన్ని తరగతుల పౌరులు తరలి రావడంతోరఆరద్దీకి టౌన్‌హాల్ పొట్ట ఎక్కడ పగిలి పోతుందో ననిపించింది. విద్యుల్లత వీనుల విందైన వీణా నాదంతో సభ ప్రారంభ మయ్యింది.

ఆహ్వానసంఘం అధ్యక్షులు రొటేరియన్ జి.వి.రెడ్డి స్వాగతించారు. అసెంబ్లీ మాజీ స్పీకర్ రేబాల దశరథ రామిరెడ్డి అధ్యక్షత స్థానమలంక రించారు. తిరుపతి మహిళా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీమతి గిర్వాణి, రచయిత్రి శ్రీమతి వేదవతి, ఒంగోలు ఎమ్పీ శ్రీమతి పార్వతమ్మ, అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్ డైరెక్టర్ వప్పు వేణుగోపాల్, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి వేదికపై ఆసీను లయ్యారు. జ్యోతి ప్రజ్వలన అనంతరం శ్రీమతి గిర్వాణి మాట్లాడుతూ సాహిత్య సాంస్కృతిక కళా రాజకీయ తత్వ భాషా శాస్త్రాలలో బె.గో.రె ప్రావీణ్యం అపారమన్నారు. అధ్యక్షించిన రేబాల దశరథరామిరెడ్డి నిదానంగా మాట్లాడుతూ గోపాలరెడ్డి ఏ పని చేసినా ఆయనకు ఆయనే సాటిగా రుజువౌ తుంటుందని ఇప్పుడు రాజకీయాల్లో లేకపోయినా ఇంతపెద్ద ఎత్తున జన్మదిన సత్కారం జరగడం, ఇంత మంది అభిమానులను సంపాదించు కోవడం అందరికీ సాధ్యం కాదని రాజకీయ రంగం పూర్తిగా చెడిపోయిన ఈకాలంలో మచ్చలేని నాయకునిగా గౌరవ మందుకోవడం గోపాలరెడ్డి గారికే చెల్లిందన్నారు. అనంతరం వేద మంత్రాలు, మంగళ వాయిద్యాల మధ్య గోపాలరెడ్డిగారికి పుష్పకిరీట మలంకరించిపట్టు వస్త్రాలతో సన్మానించారు. హైదరాబాద్ రచయిత్రి పి. వేదవతి తను రచించిన "తలపుల తరగలు' కృతిని బె.గో.రెకు అంకిత మిచ్చారు.

## డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సత్కార సభలో ప్రశంసల జడివాన

నవ్వులన్నా, పువ్వులన్నా, సద్గోష్ఠులన్నా గోపాలరెడ్డికి ఎంతో ఇష్టం. కవిగా గొప్ప హృదయ సంస్కారం; సుందరమైన ఇంద్రచాపం వంటి వ్యక్తిత్వం కల వారాయన అన్నారు వేదవతిగారు. దేశమన్నా, కాంగ్రెస్ అన్నా ఎంతో అభిమానం, రాజకీయాలు కూడా ఆయనలోని సాహితీ రసజ్ఞతను దూరం చేయలేక పోయ్యాయి అని చెప్పారు. విశ్వభారతి దృష్టి ఆయనది; ఆయనను సన్మానించడం ద్వారాతెలుగుజాతి తనను తాను సన్మానించు కొన్నట్లుందని అన్నారామె. తలపుల తరగల కృతిని స్వయంపాకుల శ్రీనివాసులు సమీక్షించారు.

మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి మాట్లాడుతూ గోపాలరెడ్డితో పోల్చుకొంటే తాము రాజకీయ మరగుజ్జుల మన్నారు. బె.గో.రె నిండు నూరేళ్లు బ్రతకాలన్న కోరికను వ్యక్తం చేశారాయన. ప్రధాన ఉపన్యాస భూమికను నిర్వహించిన వప్పు వేణుగోపాల్ - ఈ శతాబ్దాన్ని కొలిచేందుకు ఉపయోగపడే గొప్ప వ్యక్తిగా గోపాలరెడ్డిని అభివర్ణించారు. తిక్కన, మనుమసిద్ధి కలిపి ఎత్తిన జన్మ గోపాలపాలరెడ్డిది అన్నారాయన. దేశభక్తి పూర్వం రోజుల్లో వుండేది; ప్రభుత్వంలో చేరాక అది తగ్గిపోయింది; కాని గోపాలరెడ్డిగారిలో ఈనాటికి అది తొణికిస లాడుతున్నది. 60 ఏళ్ల తరువాత ఆయనే స్వంతంగా రాజకీయాల నుంచి సన్యసించారు. అందువల్లే పదవుల వాసనలు తన వెనక వదలి వేసిన కుసుమం ఆయన. విశృంఖల యువకుని విహారం ఆయన కవిత్వంలో కనపడుతుంది; అది లేకుంటే ఆయన కవిత్వం కాదు. నేను అసాధారణ వ్యక్తిని కాదని చెప్పుకోవడం గోపాలరెడ్డికే చెల్లింది. యవ్వనం, అధికారం, ధన సంపద వుంటే మనిషి తప్పకుండా చెడిపోతాడు. అన్నీ వున్నా గోపాలరెడ్డి ఏ మాత్రం మారలేదన్నారాయన. సంగీతం, సాహిత్యం, నృత్యం ఆయన గుండె దడలో కన్పిస్తాయి. ఆయనలోని గొప్పతనాన్ని పరాయి రాష్ట్రాలే ముందుగాగమనించి డాక్టరేట్ ఇచ్చినట్లు ఎంచుతూ, గోపాలరెడ్డిగారు వచ్చే శతాబ్దాన్ని తప్పకుండా చూడాలని అందరూ ఆకాంక్షించాలని ముగించారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి ఉపన్యాసం హాస్యంగా సాగింది. పబ్లిక్ మ్యాన్‌ను కాబట్టి సన్మానానికి ఒప్పుకోక తప్పింది కాదు. ఈ తమాషా అంతా చేశారు. వద్దంటే ఆగేది కాదు వయస్సు; 90 ఏళ్లు వచ్చి పడ్డాయి. దేవుణ్ణి నేను మరేమీ కోరడం లేదు, మరో 12నెలల నుంచి 15నెలలు బ్రతికించ మంటున్నాను. పొడిగిస్తే ఆనందం.. ఇవ్వక పోయినా నమస్కారం. ఈ పొడిగింపు కోరేది నాదేశ 50 ఏళ్ల స్వాతంత్ర్యం చూడాలని, 60ఏళ్ల క్రితం మంత్రిని బ్రతికున్నానని, 30ఏళ్ల క్రితం గవర్నరని బ్రతికున్నానని చెప్పుకొంటా నన్నారాయన. అప్పుడు సన్మానిస్తున్న వారంతా ఒకప్పుడు నాకు రుణపడి ఉన్నారేమో... లేకుంటే నన్నిప్పుడు రుణగ్రస్తుడ్ని చేస్తున్నారేమో... అయినా

కొరవ 7 పేజీలో



టౌన్‌హాల్ సత్కార సభలో పుష్పకిరీటధారి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి; కుడిప్రక్క కుమారుడు కృష్ణ మోహన్ రెడ్డి, కొండా బలరామిరెడ్డి, కెవి రెడ్డి; ఎడమ వైపు గిర్వాణి, మాగుంట పార్వతమ్మ, వేదవతి, వివి నరసింహం

### బెగోరె - 90

కలకత్తా నగర కళాకాంతుల్లో
కమనీయ రవీంద్ర
ప్రాంగణమ్ములో
విశ్వభారతి విద్యార్థిగా వెలిసి,
స్వచ్ఛమైన స్వేచ్ఛాయుత
వ్యక్తిత్వం
మహోన్నత మానవత్వరపోర్ధివన్
సంతరించుకుని,
అవరించినమూర్తి-
ఒక చేత రాజకీయం,
మరోచేత కవిత్వం
సమపాళ్ళలో సాగిన సవ్యసాచి-
బెజవాడ గోపాలరెడ్డిగారు-
శతాధిక వర్షములు నిండగా
స్వప్న ఫలములు కలిసి పండగా
20శతాబ్దపు ఇంద్రచాపంలా
పరచుకుని, ప్రజలతో
పంచుకున్న
ఓ సుకవీ! మా ఆంధ్రాటాగూర్
పరిమళాలు వెదజల్లే
గుల్‌మొహర్-

-- జయంపు కృష్ణ

### "శతమానం భవతి...."

చివురాకులో కవితలు
చిరుమొగ్గలో కవితలు
చిరుగాలిలో కవితలు
బెజవాడ గోపాల
కవి కిశోరుని
ఎదనిండ కవితలు
తొంభై వసంతాల
పూర్ణకౌముది సరత్కవితలు
కృష్ణవేణి నీలాల
అలల కురుల నుంచి
జారిన కవితలు
బాలగోపాలుని
వంశీనాదాలు వర్షించిన కవితలు
అవి ప్రసూన మంజరులు
హంస తూలికలు
శాంతి నికేతన నందనవన
నికుంజాలలో దాగి
ఊర్వశి పాడిన
పూల కవితలు; పాల కవితలు
ఆముదిపాల కవితలరాజా
బెజవాడ గోపాలరెడ్డికి
చిరాయురస్తు
రూపొందిన ఆమానవతా మూర్తికి
దీర్ఘాయురస్తు
విక్రమసింహపురీ
పూర్ణపురుషునకు
శతాయురస్తు.

-డా. కె.వి. సుబ్బరాయుడు

# కాంగ్రెస్ తల్లి ఒడిలోనే ప్రాణాలు విడుస్తాను!

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి 90 జన్మదినోత్సవాన్ని, క్విట్ ఇండియా దినోత్సవాన్ని ఒకే వేదికపై 9వతేది ఇందిరాభవన్‌లో డిసిసి ఘనంగా జరిపింది. మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధనరెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. బెజవాడ గోపాలరెడ్డిని గౌరవించడ మంటే మనలను మనం గౌరవింయ కొన్నట్లే నన్నారాయన. సంపన్న కుటుంబంలో పుట్టినా కాంగ్రెస్ జండా భుజాన వేసుకొని వీధుల్లో తిరిగిన గోపాలరెడ్డిగారు నెల్లూరు జిల్లాకు ఎంతో కీర్తి తెచ్చారు. 90ఏళ్లలో కూడా తాను కాంగ్రెస్ వాడినేనని ఇటీవల హైదరాబాద్‌లో గాంధీభవన్‌కు వెళ్లి చాటి చెప్పారని ప్రశంసించారు జనార్ధనరెడ్డి గారు. తెలుగుదేశం అధికారం లోకి

## జి.కాం. సన్మానంలో గోపాలరెడ్డి గారి తాదాత్మ్యం

వచ్చాక 46 మంది కాంగ్రెస్ కార్యకర్తలను పొట్టన పెట్టుకొన్నట్లు ఆవేదనగా చెప్పారు. చంద్రబాబు చేపడుతున్న విధానాలను కూడా జనార్ధనరెడ్డి ఈ సందర్భంగా తూర్పార పట్టారు. డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి మాట్లాడుతూ బెజవాడ గోపాలరెడ్డి తన రాజకీయ గురువన్నారు. విద్యార్థి దశ నుండి ఆయన నాయకత్వంలో పనిచేసిన రోజులు గుర్తుకు తెచ్చుకున్నారు. నెల్లూరు ఎమ్పీ శ్రీమతి వనబాక లక్ష్మి మాట్లాడుతూ గోపాలరెడ్డి వంటి వారివల్ల కాంగ్రెస్ పేరు నిలబడు తుందన్నారు. మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి కాంగ్రెస్‌లో బె.గో.రెను ఆదర్శ మూర్తిగా అభివర్ణించారు. మాజీ శాసన సభ్యుడు సివి శేషారెడ్డి మాట్లాడుతూ నేటి యువత గోపాలరెడ్డి జీవితాన్ని స్ఫూర్తిగా తీసుకొని పని చేయాలన్నారు. కాకినాడ మాజీ ఎమ్పీ పళ్లంరాజు, మాజీ శాసన సభ్యులు కె.వి.సుబ్బారెడ్డి, డాక్టర్ సుందరరామిరెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి, పివి రమణారెడ్డి సభలో మాట్లాడారు.

సభా ప్రారంభంలోనే పలువురు కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తలు బెజవాడ గోపాలరెడ్డిని పూలమాలలు, పట్టు శాల్వలతో ముంచెత్తారు. సన్మానానికి కృతజ్ఞతలు తెలియజేస్తూ గోపాలరెడ్డి మాట్లాడారు. రాజకీయంలో చేరిన తొలినాళ్లలో ఏరేవులో నావకు లంగరు వేశానో అక్కడే ఇప్పటికీ వున్నాను. 5సత్యాగ్రహాల్లో పాల్గొన్నాను. నాతో పనిచేసిన వారంతా చనిపోయారు. కాంగ్రెస్ తల్లి ఒడిలోనే పుట్టి, పెరిగాను; ఆ తల్లి ఒడిలోనే ప్రాణాలు విడుస్తానని సగర్వంగా చెబుతున్నా నన్నారాయన. సభలో [illegible] సమర యోధులు [illegible] దేవదానంలను జనార్ధనరెడ్డి సన్మానించారు.

